# పాఠకులకు, చందాదారులకు విజ్ఞప్తి

ప్రియమైన పాఠకులకు,

మన పత్రిక చందమామ ప్రచురణ యాభైయవ సంవత్సరంలో అడుగుపెడుతున్నదని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము. ఈ సందర్భంగా తీసుకురానున్న కొన్ని మార్పులను గురించి పాఠకులకు తెలియజేయడం మా కర్తవ్యంగా భావిస్తున్నాము. విదేశాల నుంచి దిగుమతి చేసుకుంటూన్న కాగితాన్ని మాత్రమే చందమామకు ఉపయోగిస్తున్నాము. ఇటీవల ప్రచురణకు కావలసిన న్యూస్‌ప్రింట్ కోసం అనేక ఇబ్బందులకు లోనయ్యాము. ముఖ్యంగా కాగితం ధర అనూహ్యమైన రీతిలో పెరిగిపోయింది. దీనితో పాటు పత్రికా ముద్రణకు సంబంధించిన వివిధ వస్తువుల ధరలు కూడా విపరీతంగా పెరిగిపోవడం వల్ల పరిస్థితి మరింత క్లిష్టంగా పరిణమించింది.

ఈ ఇబ్బందుల భారాన్ని పాఠకులపై మోపకుండా మేమే భరించడానికి ఇంత వరకు మా శాయశక్తులా ప్రయత్నించాము. అయితే, ఇప్పుడు ఆ విషయాన్ని పాఠకులకు తెలియజేయవలసిన నిర్బంధం ఏర్పడింది.

వచ్చే నెల నుంచి అంటే జూలై సంచిక నుంచి చందమామ ధర ఒక రూపాయి పెరుగుతుంది. విడి ప్రతి 6-00 రూపాయలు: సంవత్సర చందా 72-00 రూపాయలు.

ఈ సందర్భంగా తెలియజేస్తున్న మరొక ముఖ్య విషయం ఏమంటే- చందమామ కొద్దిగా పెద్ద సైజులో అంటే – దాని మొట్టమొదటి సైజులో, మరింత ఆకర్షణీయంగా స్వర్ణోత్సవ సంవత్సరంలోకి ప్రవేశిస్తుంది.

ఈ మార్పులను పాఠకులు సంతోషంగా ఆమోదించి ఆహ్వానించగలరని విశ్వసిస్తున్నాము.

శుభాకాంక్షలతో,
మీ విశ్వసనీయమైన,

(బి. విశ్వనాథరెడ్డి)
ప్రచురణకర్త



GUESS WHO'S MY BEST FRIEND in SCHOOL ?




*Chelpark*

**CHELPAK RANGE OF PRODUCTS :** WAX CRAYONS, WATER COLOUR CAKES, PEN, PENCIL, INK, OIL PASTELS, MOPPLES COLOUR SET, WATER COLOUR SET, GUM etc.

**CHELPAK COMPANY PVT. LTD.** A-93, Industrial Estate, Rajajinagar, Bangalore - 560 044. Phone : 91-080-3351562, 3351694

Option 96





# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి




## అనుకరణ అపాయం!

మనిషి కోతి నుంచి పరిణామం చెందాడని విజ్ఞాన శాస్త్రవేత్తలు చెబుతారు. దేనిని చూసినా వెంటనే అనుకరించాలనే స్వభావం కూడా మనిషికి కోతి నుంచే వచ్చి వుంటుందని అనుకోవచ్చు. ఎందుకంటే మనిషి కూడా కోతిలాగే ఎప్పుడూ ఎవరినో ఒకరిని అనుకరించడానికి సిద్ధంగా ఉంటాడు. ఎవరిని అనుకరిసిస్తాడన్నది వయసును బట్టి పరిస్థితులను బట్టి ఉంటుంది. కొందరు క్రీడాకారులను అనుకరిస్తే, మరికొందరు సినిమా హీరోలను అనుకరిస్తారు. ఇంకా కొందరు రాజకీయ నాయకులను అనుకరిస్తారు.

ఈనాడు మిగతా వాటికన్నా టీవీల ప్రభావం సమాజం మీద ఎక్కు వగా ఉన్నది. వెయ్యి మాటలు చెప్పలేనిది ఒక బొమ్మ చెబుతుంది అంటారు. ఇవాళ టీ.వీ. ఆ పని చేస్తున్నది. కాబట్టి టీవీ కార్యక్రమాలు ం రూపొందించే వారు బాధ్యతాయుతంగా వ్యవహరించడం అవసరం.

ప్రతి రంగంలోనూ వ్యాపారదృష్టి ప్రబలిపోయిన ఈ కాలఘట్టంలో వ్యాపార ప్రకటనల పట్ల జాగ్రత్తగా ఉండాలి. ఏది నిజం? ఏది కాదు? అనే విచక్షణ ప్రేక్షకులకు ఉండాలి. అంతేకాని, బుల్లితెర మీద కనిపించే ప్రతి ఒక్కటీ నిజమనుకుని అనుకరించినట్టయితే ఆపదలపాలు కాక తప్పదు!

లక్నోలో గత ఏప్రిల్ నెలలో ఒక ఆరేళ్ళ కుర్రాడు టీవీలో ఒక శీతల పానీయం ప్రకటన చూశాడు. ఆ ప్రకట నలో ఒక సాహస యువకుడు ఎత్తయిన మేడమీది నుంచి కింద వేన్‌లో వెళుతూన్న సాఫ్ట్ డ్రింక్స్ బాటిల్స్ మీదికి దూకి, వాటిలో ఒకదానిని అందుకుని హాయిగా తాగుతాడు. దాన్ని చూసి ఆ కుర్రాడు, ఉత్సాహం కొద్దీ ఆయువకుణ్ణి అనుకరిం చాలనుకుని రెండవ అంతస్తుపై నుంచి కిందికి దూకి ప్రాణాలు పోగొట్టుకున్నాడు!.

టీవీలు చూడకుండా ఉండలేము. కాని మితంగా చూడాలి. చూసిన ప్రతిదానినీ నిజమనుకుని అనుకరించే అమాయకత్వాన్ని వదులుకోవాలి!


సంపుటి : 98 జూన్ '96 సంచిక : 6

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00




వార్తలు - విశేషాలు:

# స్పెయిన్‌లో మార్పు

స్పెయిన్‌లో ప్రజలు మార్పు కోరుకున్నారు. 1982వ సం॥ నుంచి తమను పాలిస్తూన్న సోషలిస్ట్ పార్టీని అధికారం నుంచి దించారు. మార్చ్ 3వ తేదీన స్పెయిన్ పార్లమెంట్ దిగువసభ అయిన కార్టెస్‌కు ఎన్నికలు జరిగాయి. 350 స్థానాలు గల సభలో ప్రధానమంత్రి ఫిలిప్ గోన్జాలెజ్ నాయకత్వంలోని సోషలిస్ట్ పార్టీకి 141 స్థానాలు మాత్రమే లభించాయి. జోస్ మేరియా అజ్నార్ నాయకత్వంలోని పాపులర్ పార్టీకి 156 స్థానాలు లభించాయి. అధికారం చేపట్టడానికి దానికి ఇంకా 20 స్థానాలు కావాలి. 16 స్థానాలు గెలుచుకున్న కాటలాన్ నేషనలిస్ట్ పార్టీ, 5 స్థానాలు గెలుచుకున్న బాస్క్ నేషనలిస్ట్, పాపులర్ పార్టీకి మద్దతు తెలియజేయడంతో అది అధికారాన్ని చేపట్టింది.

సోషలిస్టుల పట్ల ప్రజలకు విముఖత కలగడానికి అనేక కారణాలు ఉన్నాయి. వాటిలో లంచగొండితనం ముఖ్యమైనది. హోమ్ శాఖామంత్రి 'డెత్‌స్క్వాడ్స్' సహకారంతో ప్రతిపక్షమైన బాస్క్ నేషనలిస్ట్‌కు చెందిన కొందరు కార్యకర్తలను హతమార్చాడు. ఆ కారణంగా అతన్ని మంత్రి పదవి నుంచి తొలగించారు. దాంతో కాటలాన్ నేషనలిస్ట్ పార్టీ పాలకపక్షానికి తన మద్దతు ఉపసంహరించుకున్నది. త్వరగా ఎన్నికలు జరపాలని ఒత్తిడి తీసుకువచ్చింది. దేశ ఆర్థిక పరిస్థితి సుస్థిరంగా ఉన్నప్పటికీ, యువతరంలో నిరుద్యోగసమస్య దాదాపు 40 శాతానికి పెరిగి పోయింది. ఇవన్నీ పాలకపక్షం పట్ల ప్రజలఅసంతృప్తికి దోహదం చేశాయి.

రెండవ ప్రపంచ యుద్ధ (1939-45) సమయంలో స్పెయిన్‌ను నియంత జనరల్ ఫ్రాంకో పాలించాడు. స్పెయిన్ రాజు దేశం నుంచి పారిపోయాడు. తన మరణానంతరం స్పెయిన్ మళ్ళీ రాచరిక వ్యవస్థ కిందికి వస్తుందనీ, యువరాజు జువాన్ కార్లోస్ తన వారసుడవుతాడనీ 1947వ సం॥లో ఫ్రాంకో ప్రకటించాడు. అది 28 సం॥ ల తరవాత అంటే 1975వ సంవత్సరంలో జనరల్ ఫ్రాంకో మరణానంతరం అమలులోకి వచ్చింది.

1978లో స్పెయిన్ నూతన రాజ్యాంగం రూపొందించుకున్నది. డెమొక్రటిక్ పార్టీ తరపున అడోల్ఫో స్వారెజ్ ప్రధానమంత్రి అయ్యాడు.

1982వ సం॥లో జరిగిన ఎన్నికలలో గోన్జాలెజ్ నాయకత్వంలోని సోషలిస్ట్ వర్కర్స్ పార్టీ ఘన విజయం సాధించి అధికారం చేపట్టింది. ఆ తరవాత జరిగిన రెండు ఎన్నికలలో దాని పలుకుబడి క్రమంగా తగ్గుతూ వచ్చింది. నాలగవసారి కూడా తానే ప్రధాని కాగలనని గోన్జాలెజ్ ఆశించాడు. కానీ ప్రజలు వేరు విధంగా తీర్పునిచ్చారు.

ఈ విషయం గురించి ప్రస్తావించినప్పుడు పార్టీ డెప్యూటీ లీడర్, "ఇంతటి చేదైన విజయం; సున్నితమైన పరాజయం మరెన్నడూ చవిచూడలేదు," అన్నాడు.






# గోవిందుడి తలబిరుసు

గోవిందుడు తలబిరుసు మనిషని అంతా చెప్పుకుంటారు. కానీ, అధికారులవద్ద ఎంతో వినయంగా వుండడం వల్ల, జీవితంలో బాగా పైకి వచ్చాడు. కొన్నాళ్ళకు వాడు రాజు కొలువులో ముఖ్యమైన రాజోద్యోగి అయ్యాడు.

ఆ దేశపు రాజు ఇంద్రకాంతుడికి చిరాకెక్కువ. చీటికీ మాటికీ ఆయన రాజోద్యోగులపై విరుచుకుపడుతూండేవాడు. ఒకరోజున ఆయనకు మనసు బాగోక, అప్పుడెదురుగావున్న గోవిందుడిపై మండిపడి, "మళ్ళీ నీ ముఖం నాకు చూపించకు. అవతలకు పో!" అంటూ కసిరాడు.

ఉత్తపుణ్యాన రాజలాగనడంతో, ఏం చేయాలో తోచక గుడ్ల నీరు కుక్కుకుంటూ, అక్కణ్ణించి వెళ్ళిపోయాడు గోవిందుడు.

ఈ విషయం సుధీరుడనే మంత్రికి తెలిసింది. ఆయన గోవిందుడికి కబురుచేసి, "నువ్వు విద్యాధికుడివి. తెలివైన వాడివి. ఉత్తపుణ్యాన రాజు నిన్నలా చిన్నబుచ్చడం నాకు నచ్చలేదు. నాతోరా, ఆయన్ను సంజాయిషీ అడుగుదాం," అన్నాడు.

గోవిందుడు వెంటనే, "కోపం వచ్చింది రాజుక్కానీ, నాక్కాదు కదా! నా వల్ల ఏదైనా పొరబాటు జరిగిందేమో! నేనే సంజాయిషీ ఇచ్చుకోవాలి. చేతనైతే సంజాయిషీ ఏమివ్వాలో నాకు సలహా ఇవ్వు!" అన్నాడు.

సుధీరుడు, రాజు వద్దకు వెళ్ళి, "ప్రభూ! తమరు చీటికీ మాటికీ అమాయకులపై విరుచుకుపడడం మంచి అలవాటు కాదు. అందువల్ల ఎందరో మంచివారి మనసులు నొప్పిస్తున్నారు," అంటూ గోవిందుడి విషయం చెప్పాడు.

రాజు ఇంద్రకాంతుడు ఒక క్షణం మౌనంగా ఊరుకుని, "ఉత్తపుణ్యాన నేను తిడితేనొచ్చుకునేందుకు బదులు, సంజాయిషీ ఏమివ్వాలని ఆలోచించే గొప్ప వినయం గోవిందు

డిదని, ఇంతకాలం నాకు తెలియదు. వాడికి మంచి బహుమతి ఇవ్వాలి.సీతాపురం గ్రామాధికారి పదవి ఖాళీగా ఉన్నది కదా! గోవిందుణ్ణి సీతాపురంగ్రామాధికారిగానియమిస్తున్నాను," అన్నాడు.

ఆ విధంగా గోవిందుడు సీతాపురం గ్రామాధికారి అయ్యాడు. ఎంతో కాలంగా రాజుకొలువులో పైఅధికారులకూ, మంత్రులకూ, రాజుకూ అడుగులకు మడుగులొత్తే గోవిందుడికి, ఈ పదవి చాలా కొత్తగావుంది. గ్రామంలో వాడికంటే పై అధికారి లేడు. వాడి మాటకు ఎదురులేదు.

గ్రామపాలనలో గోవిందుడికి సలహాదారుడుగా వుండేవాడు, రంగన్న. రంగన్నతెలివైనవాడు. నిష్కపటి. తన మానాన తనుబ్రతుకుతూ, ఒకరి జోలికి అనవసరంగా వెళ్ళడు. నిస్వార్థపరుడు.

రంగన్న సలహాలతో కొంతకాలం పాటు గోవిందుడు చక్కగా వ్యవహరించాడు.

గోవిందుడు గ్రామపెద్దలను పిలిచి, అప్పుడప్పుడూ తన పాలనను గురించి అభిప్రాయాలడుగుతూండేవాడు. వాళ్ళు ఒకనాడు ఏక కంఠంగా, "రంగన్న సలహాలున్నంత కాలం, మీకే ఇబ్బందీ ఉండదు. పాలన సమర్థవంతంగా ఉంటుంది," అన్నారు.

ఇది విన్న గోవిందుడికి బాధ కలిగి, మర్నాడు రంగన్నను పిలిచి, "గ్రామంలో పరిస్థితులు మెరుగుపడ్డాయి. ఇందుకు నా



సమర్థత కారణమా? నీ సలహాలు కారణమా?" అని అడిగాడు.

రంగన్న నవ్వి, "ఇదివరకున్న గ్రామాధికారికూడా నేను సలహాలిచ్చాను. సలహాల మంచి చెడ్డలు తెలుసుకునే శక్తి గ్రామాధికారికుండాలి కానీ, సలహాల్లో విశేషమేమీ ఉండదు. నిస్సందేహంగా సమర్థత మీదే!" అన్నాడు.

వాడి సమాధానం గోవిందుడికి అంతగా తృప్తి కలిగించలేదు. తన సలహాలు వినడంలోనే గ్రామాధికారి సమర్థత వున్నదని వాడన్నట్లు తోచి ఈ పరిస్థితిని సరిదిద్దాలనుకున్నాడు. గ్రామంలో ఆరా తీయగా, శకుని అనేవాడికి రంగన్నంటే అంతగా పడదని



రంగన్నను పిలిచి, "నువ్వూ, నేనూ గ్రామాధికారికి సలహాదార్లంకదా! అందువల్ల గ్రామాధికారి మందిరంలో మనకు ప్రత్యేకంగా గదు లుండాలని గోవిందుడికి చెబుదాం," అన్నాడు.

"సలహాలివ్వడం పెద్దపనా! దానికి వేరే గది కావాలా? ఎందుకొచ్చిన బెడదలెద్దూ!" అన్నాడు రంగన్న.

శకుని ఆ సాయంత్రం గోవిందుడి వద్దకు వెళ్ళి, "తమకు సలహాలివ్వడం, ఎంతో బాధ్యత గల మహాకార్యంగా భావించి, నేను వేరే గది ఒకటి కావాలనుకుంటున్నాను. కానీ అదీ ఒక పెద్ద పదవేనా, అంటూ రంగన్న చులకనగా మాట్లాడాడు," అంటూ పితూరీలు చెప్పాడు.

తెలిసింది. ఒకనాడు గోవిందుడు, రంగన్నతో, "ఒక్కరి సలహాతో మంచిచెడ్డలు తెలియవు. ఇక మీదట శకుని సలహాలు కూడా తీసుకుందామనుకుంటున్నాను," అన్నాడు.

"మీలో విచక్షణ ఉన్నంతకాలం ఎవరి సలహాలైనా మంచివే," అని ఊరుకున్నాడు రంగన్న.

ఆ రోజునుంచీ గోవిందుడు అన్ని విషయాలకూ శకునినే సలహాలడగసాగాడు.

శకుని తెలివి గలవాడు. కానీ వాడికి అధికారదర్పం ఎక్కువ. గ్రామాధికారికి సలహాదారంటే– అదొక పెద్ద పదవనీ, అందువల్ల తనకు ప్రత్యేకమైన గుర్తింపు కావాలనుకున్నాడు. తనకొక్కడికీ అయితే బాగుండదని

"అలాగా! సలహాలన్నీ నిన్నే అడుగుతున్నాను గదా! తననేమీ అడగడం లేదని అక్కసు అయివుంటుంది. మీ ఇద్దరికీ నా మందిరంలో చెరొక గదీ కేటాయిస్తాను. సలహాలు మాత్రం నిన్నే అడుగుతూంటాను," అన్నాడు గోవిందుడు.

"వద్దన్నాడుగా, వాడికి గది ఎందుకు?" అన్నాడు శకుని చిరాకు పడుతూ.

"చూసే వాళ్ళకు నాది పక్షపాతబుద్ధి అనిపించకూడదు!" అన్నాడు గోవిందుడు.

ఆనాటినుంచీ శకుని విజృంభించి గోవిందుడికి, "గ్రామాధికారి అంటే గ్రామానికి రాజువంటివాడు. కాబట్టి దర్పంగా ఉండాలి. అందరితోటీ మాట్లాడ కూడదు. ఎవర్నీ

నవ్వుతూ పలకరించకూడదు. ఎవరైనా దణ్ణం పెడితే చూసి ఊరుకోవాలే తప్ప, ప్రతి నమస్కారం చేయకూడదు. కాస్త లోకువగా ఉన్న వాళ్ళను కసురుతూ ఉండాలి. తలబిరుసుగా ఉండేవాళ్ళను నయానా, భయానా లొంగ దీయాలి," అంటూ సలహాలిచ్చాడు.

స్వయానా తలబిరుసు మనిషైన గోవిందుడికి, ఈ సలహాలు నచ్చాయి. వెంటనే అమలుచేశాడు. అయినా వాడికెవరూ ఎదురు చెప్పలేదు. దాంతో గోవిందుడు మరింత రెచ్చిపోయి ప్రవర్తించసాగాడు. గ్రామాధికారికి రాజు ప్రాపకముంది కదా అని అందరూ వాడికి భయపడేవారు.

అయితే, రంగన్న ఒక్కడే మిగతావాళ్ళకు విరుద్ధంగా ప్రవర్తించసాగాడు. గోవిందుడు ప్రతినమస్కారం చేయడంలేదని గమనించాక, వాడు తనూ గోవిందుడికినమస్కారం చేయడం మానుకున్నాడు. గోవిందుడడగడం మానితే, వాడూ సలహాలివ్వడం మానేశాడు.

ఒకరోజు రంగన్న గోవిందుడు చిరాకు పడుతూ మాట్లాడగానే, "నా తప్పేమిటోచెప్పు. సంజాయిషీ ఇచ్చుకుంటాను. అనవసరంగా మాటంటే పడను. రాజుగారికి ఫిర్యాదు చేస్తాను," అన్నాడు.

ఫిర్యాదు అనగానే గోవిందుడు భయపడ్డాడు. అయితే, రంగన్న తనను బెదిరిస్తున్నాడన్న కోపం కొద్దీ, "ఏమని ఫిర్యాదు చేస్తావో చెప్పు!" అన్నాడు.



రంగన్న చెప్పడం మొదలుపెట్టేసరికి, వాడికి ఉక్రోషం వచ్చి, "ఊరికే ఎందుకు మాట్లాడతావు? నువ్వేం మాట్లాడినా నేను వినదల్చుకోలేదు. ఇంకెప్పుడూ నాతో మాట్లాడకు," అన్నాడు.

"నువ్వడిగావని చెప్పాను తప్పితే, నీవు వ్చ ుటే నీతో మాట్లాడను," అని వెంటనే అక్కణ్ణించి వెళ్ళిపోయాడు రంగన్న.

అది మొదలు వాడు, గోవిందుడితోఒక్క ముక్క కూడా మాట్లాడలేదు.

ఇందుకు గోవిందుడికి చాలా కోపంగా ఉండేది. కానీ ఏం చేయాలో తెలియక శకుని సలహా అడిగాడు. 'ఈ గ్రామం జనాభా లెక్కలన్నీ రంగన్న దగ్గరున్నాయి.



"మీరు చాలా మంచివారు. మీ ప్రతాపం, అధికారం చూపించండి. వాడే వస్తాడు," అన్నాడు శకుని.

ఆ రోజునుంచీ రంగన్నకు కష్టాలు మొదలయ్యాయి. వాడింటి పన్నూ, పొలం పన్నూ పెరిగాయి. వాడి పొలానికి నీళ్ళు దొరికేవి కావు. వాడి ధాన్యానికి సరైన ధర పలికేది కాదు.రంగన్న పెదవి విప్పకుండా ఈ అత్యాచారాలన్నీ సహించాడు.

కొన్నాళ్ళ తరవాత రంగన్న కూతురు పెళ్ళి జరిగింది. వాడు గ్రామస్థులందరినీ స్వయంగా ఆహ్వానించాడు కానీ, గోవిందుడికి మాత్రం చీటీ పంపించాడు. ఇది పెద్ద అవమానంగా భావించిన గోవిందుడు, రంగన్న మీద ఏదైనా తప్పుడునేరం మోపి ఖైదులో వేయాలని కుట్ర ప్రారంభించాడు.

వాటి గురించి కొన్ని సందేహాలున్నాయనీ, తీర్పమనీ వాడినడగండి. చచ్చినట్లు వచ్చి మాట్లాడతాడు," అనిసలహా ఇచ్చాడు శకుని.

"మరి వాడు ముందు మాట్లాడకుండా,నేను మాట్లాడడం పొసగదే!" అన్నాడు గోవిందుడు.

"దాందేముందీ–పాలేరునుపంపితే సరిపోతుంది," అన్నాడు శకుని.

గోవిందుడు పాలేరు ద్వారా రంగన్నకు కబురు పంపాడు. సందేహాలేమిటో చెప్పమని రంగన్న, పాలేరు ద్వారా కబురు పంపాడు. గోవిందుడుఆసందేహాలేమిటో చెబితే, పాలేరు ద్వారానే సమాధానాలు పంపాడు రంగన్న.

"ఈ రంగన్న మహాతలబిరుసు మనిషి!" అన్నాడు గోవిందుడు, శకునితో.

రంగన్నకు ఈ సంగతి పాలేరూ, గ్రామ కాపలావాడి ద్వారా తెలిసింది. రాజుగారికి ముఖ్య సలహాదారుడైన సుధీరుడనేవాడు రంగన్నకు దగ్గరి బంధువు. రంగన్న రాజధానికి వెళ్ళి గోవిందుడి ఆగడాల గురించి చెప్పాడు.

అంతా విన్న సుధీరుడు, "ఏమిటీ? ఇక్కడ కొలువులో పిల్లిలా పడుండే గోవిందుడు, మీ గ్రామం చేరి క్రూరజంతువయ్యాడా? ఆశ్చర్యంగా వుందే! క్షణాలమీద వాడి పదవి ఊడేలా చేయగలను," అంటూ మండిపడ్డాడు.

రంగన్న నవ్వి, "అందువల్ల సమస్యకు శాశ్వత పరిష్కారం లభించదు. ఇలా పదవి లోకి వచ్చేవారందరికీ తలబిరుసు పోవడానికి ఏదైనా ఉపాయం ఆలోచించాలి," అన్నాడు.

సుధీరుడు అవుననన్నట్లు తలాడించి, "రాజు ఇంద్రకాంతుడికి కూడా తలబిరుసెక్కువే. కొద్దిరోజులుగా అస్వస్థతతో మంచం పట్టా డాయన. రాజ్యపాలనా వ్యవహారాలన్నీ యువ రాజు చంద్రకాంతుడే చూస్తున్నాడు. చంద్ర కాంతుడు సమర్థుడు, బుద్ధిమంతుడు, వినయ శీలి. తండ్రివల్ల జరిగిన పొరపాట్లకు ఆయ నెంతో బాధపడుతున్నాడు. నీ సమస్యకాయన మంచి పరిష్కారం చూపగలడు," అన్నాడు.



తర్వాత సుధీరుడు రంగన్నను, యువరాజు చంద్రకాంతుడి వద్దకు తీసుకు వెళ్ళాడు. ఆయన జరిగినదంతా విని, "ఇదంతా నా తండ్రిగారి కారణంగానే జరిగింది. ఆయనను చూసిన రాజోద్యోగులూ, రాజప్రతినిధులూ, ఆఖరుకు గ్రామాధికారులూ – అందరూ తల బిరుసుతనం అలవర్చుకున్నారు. ఇది సరి దిద్దాలంటే ఒక్కటే ఉపాయం! నేను మీ గ్రామానికి వస్తాను. గతంలో నా తండ్రిగారు ఉత్తపుణ్యాన గోవిందుడిపై మండిపడ్డాడు గదా? అందుకు గాను అతడికి క్షమాపణ చెప్పుకుంటాను. నన్ను చూసి గోవిందుడు మారవచ్చు," అన్నాడు.

"అయితే తమరు క్షమాపణను సంస్కృ తంలో చెప్పండి. నేను దాన్ని తర్జుమా చేసి గోవిందుడికి వినిపిస్తాను. అతడికి సంస్కృతం రాదు," అన్నాడు రంగన్న.

రంగన్న అలా ఎందుకన్నాడో ఊహించిన చంద్రకాంతుడు, తనలో తనే నవ్వుకున్నాడు. ఆ తర్వాత యువరాజు, రంగన్న, సుధీరుడు సీతాపురం తరలి వెళ్ళారు.

వాళ్ళను చూసి గోవిందుడు కంగారు పడ్డాడు కానీ, చంద్రకాంతుడి మాటతీరు చూశాక వాడికి ధైర్యం పెరిగింది. పైగా యువరాజు తనకు క్షమాపణ చెప్పేందుకు వచ్చాడనగానే, వాడి తలబిరుసుతనం కూడా పెరిగింది. ఇక రంగన్న ఇంటిదారి పట్టక తప్పదనుకున్నాడు వాడు. గ్రామాధికారి మందిరంలో యువరాజు, సుధీరుడు, రంగన్న,

శకుని, గోవిందుడు కొందరు గ్రామపెద్దలు సమావేశమయ్యారు. చంద్రకాంతుడు గొంతు సవరించుకుని, "నా తండ్రిగారి కారణంగా జరిగిన పొరపాట్లను నా ప్రవర్తనతో సవరించా లనుకుంటున్నాను. నేను గోవిందుడికి రాజుగారి తరఫున క్షమాపణ చెబుతాను.నేను గురుకులంలో అన్ని విద్యలూ సంస్కృతంలో నేర్చుకున్నవాణ్ణి. ఇప్పుడు గ్రామీణుల మధ్య వారి భాషలో మాట్లాడాలంటే సంకోచంగా వుంది. అందువల్ల నేను సంస్కృతభాషలో చెబుతాను. రంగన్నతర్జుమా చేసి గోవిందుడికి వినిపిస్తాడు," అన్నాడు.

శకుని గోవిందుడి చెవిలో, "యువరాజు మహా తెలివిమంతుడు. ఈ దెబ్బతో రంగన్న చచ్చినట్టు మీతో మాట్లాడాల్సిందే!" అన్నాడు.

గోవిందుడు తన ఉన్నతస్థితికి సంబర పడ్డాడు.

తర్వాత చంద్రకాంతుడు సంస్కృతంలో మాట్లాడగా, రంగన్న సైగలతో గోవిందుడికేదో చెప్పాడు. అది వాడికర్థం గాక, "ప్రభూ! వీడి తలబిరుసు చూడండి. నాతో మాట్లాడవద్ద న్నానని సైగలు చేస్తున్నాడు. తమంతటివారిని చూసైనా బుద్ధి తెచ్చుకోవడంలేదు," అన్నాడు.

చంద్రకాంతుడు సాలోచనగా తల పంకించి, "తలబిరుసుకూ, ఆత్మగౌరవానికీ చాలా తేడావుంది. మాట్లాడవద్దన్న వాడితో మాట్లాడక పోవడం ఆత్మగౌరవం. దేశానికి యువరాజునైననేనే, నాది కాని తప్పుకూడా క్షమాపణ అడిగి ఒక ఆదర్శాన్ని నెలకొల్పాను. రంగన్నను మాట్లాడవద్దనడం నీ తప్పు అయినప్పుడు, దానికి క్షమాపణ అడగాలని తోచకపోడవంవల్ల, నీకు తలబిరుసు ఎక్కు వని నేననుకోవచ్చుగదా!" అన్నాడు.

ఈ మాటలు గోవిందుడికి చెళ్ళుమంటూ తగిలాయి. వాడు సిగ్గుతో తలవంచుకుని, తన తప్పు క్షమించమని రంగన్నను కోరాడు.

రంగన్న నవ్వి, "తప్పుకు క్షమాపణ అవ సరం లేదు. తప్పును గ్రహిస్తే చాలు.సమస్య పరిష్కారమైపోతుంది," అన్నాడు.

ఈ ధర్మసూక్ష్మం తెలుసుకున్నాక గోవిందు డికి తలబిరుసు మనుషులు మళ్ళీ ఎదురు కాలేదు.






12

[దేశంకాని దేశాలలో రూపధరుడు నానా అగచాట్లూ పడి స్వదేశాన్ని చేరుకునే సమయంలో, అతడి కుమారుడు ధీరమతి తన తండ్రి అచూకీ తెలుసుకోవాలని నిశ్చయించాడు. రూపధరుడి భార్యను పెళ్ళాడగోరిన అనేకమంది రాజకుమారులు తన ఇంట చేరి ఇల్లు గుల్లచేయటం అతనికి నచ్చలేదు. ఈ విషయమై ఒక సమావేశం జరిపినా ప్రయోజనం లేకపోయింది. అందుచేత ధీరమతి తన తండ్రి వార్తలు తెలుసుకునేటందుకు నౌకలో ఇథకా నుంచి పైలాస్‌కు బయలుదేరాడు - తరవాత]

నౌక పైలాస్ తీరాన్ని తాకేసరికి మర్నాడు బాగా తెల్లవారిపోయింది. సముద్రతీరాన ప్రజలు వరుణదేవుడికి నల్లటి ఎద్దులను బలి చేస్తున్నారు. అక్కడ తొమ్మిది జట్లు చేరి ఉన్నాయి. ఒక్కొక్క జట్టులోనూ అయిదేసి వందలమంది ఉన్నారు. తీరం పొడుగునా అక్కడక్కడ తొమ్మిది గాడిపొయ్యిలు మండుతున్నాయి; రకరకాల వంటలు సాగుతున్నాయి. నావికులు తెరచాపలు దింపి పడవను ఒడ్డున కట్టేశాక, ధీరమతీ, అతని వెంట వచ్చిన వృద్ధుడు సహనుడూ ఒడ్డుకు దిగి నడవ సాగారు. అక్కడ చేరిన ప్రజలను పరిశీలనగా చూస్తూ ముందుకు నడిచారు.

"మనం ఇప్పుడు నవద్యోతుణ్ణి చూడబోతున్నాం. నువ్వు బిడియపడకుండా అయనతో వచ్చిన పని చెప్పెయ్యి. మీ నాయన వృత్తాంతం అడుగు. మీ తండ్రి వార్తలేమైనా అయనకు తెలిశాయా? ఆయన మరణిం

చాడా? మరణిస్తే ఎవ్వుడు, ఎక్కడ మరణించాడు? ఈ వివరాలు నవద్యోతుడికి తెలుసునేమో కనుక్కో. నవద్యోతుడికి నిజం తెలియాలే కానీ దాచిపెట్టే రకం కాదు;చాలా పెద్దమనిషి. ఈ ప్రశ్నలు ఆయనను నువ్వే అడగటం భావ్యంగా ఉంటుంది," అన్నాడు ధీరమతితో సహనుడు.

"నేనింకా కుర్రవాణ్ణి. పెద్దవాళ్ళతో మాట్లా డటం చేతకాదు, అదే నాకు భయంగా ఉంది," అన్నాడు ధీరమతి.

సహనుడు ఆ యువకుడికి ధైర్యం చెబుతూ, నవద్యోతుడూ ఆయన కుమా రులూ కూర్చుని ఉన్న శిబిరానికి తెచ్చాడు. ఎవరో కొత్తవారు వస్తూండటం చూసి, నవద్యోతుడి కుమారులు ధీరమతికీ, సహనుడికీ ఎదురు వచ్చి స్వాగతం తెలిపారు. తరవాత వారు నవద్యోతుడికి సమీపంగా మెత్తని తోళ్ళు ఇసుకపై పరచి, అతిథులను వాటిపై కూర్చో బెట్టి ఆహారమూ, ద్రాక్షరసమూ ఇచ్చారు.

వారు కడుపునిండా భుజించాక, నవ ద్యోతుడు తన అతిథులకేసి తిరిగి, "ఇప్పుడు చెప్పండి, మీరెవరు? మీరు ఏ దేశంనుంచి సముద్రం దాటి వస్తున్నారు? ఇక్కడికే పని పెట్టుకుని వచ్చారా? లేక మరెక్కడికో ఇటుగా పోతూ దారిలో ఆగారా?" అని అడిగాడు.

ధీరమతి ధైర్యంగా జవాబిచ్చాడు:

"మహారాజా! మాది ఇథకా. నేను స్వంత పనిమీదనే వస్తున్నాను. ట్రోయ్ యుద్ధ



రంగంలో మీ సరసను యుద్ధం చేసిన నా తండ్రి రూపధరుడి వార్తలు తెలుసుకునే నిమిత్తమై నేను బయలుదేరి వచ్చాను. యుద్ధానికి వెళ్ళినవారందరి వార్తలూ తెలిశాయి, కాని నా తండ్రి వార్త చెప్పేవారు లేకుండా ఉన్నారు. ఆయన చనిపోయినట్టు మీకు రూఢిగా తెలిస్తే, ఆ సంగతి దయచేసి దాచకుండా చెప్పండి. మీరందరూ కలిసి యుద్ధరంగంలో ఎన్నో కష్టాలు పంచుకున్నారు. అందుకైనా మీకు తెలిసిన విషయాలు నాతో దాచకుండా చెప్పండి."

ఈ మాటలు విని అతనితో నవద్యోతుడు ఇలా అన్నాడు:

"నాయనా, ఒక్కసారిగా జరిగిన విషయాలు జ్ఞాపకం చేశావు. వజ్రకాయుడి నాయకత్వం కింద మేము పడవలో వెళ్ళి ట్రోయ్ నగరానికి ముట్టడి వేసి, తొమ్మిదేళ్ళ పాటు అతి క్రూర మైన యుద్ధం సాగించాము. మా యోధులలో ఎందరో ఆ యుద్ధరంగాన ప్రాణాలర్పించారు. ఆ సంఘటనలు చెప్పాలంటే అయిదారేళ్ళు పడుతుంది. తొమ్మిదేళ్ళు నానా అగచాట్లూ పడి, చిట్టచివరకు దైవకృప వల్ల విజయం పొందగలిగాం కాని ఉపజ్ఞలో ఒక్కడుకూడా మీ తండ్రి అయిన రూపధరుడికి చాలలేదు. మా ఇద్దరి మధ్య ఒక్క సారి కూడా అభిప్రాయభేదం రాలేదు. మా సలహాలు ఎప్పుడూ ఒకేవిధంగా ఉండేవి. అయిందేదో అయిపోయిందా, తీరా తిరుగుప్రయాణం సాగించే సమయాన మాలో కక్షలు బయలుదేరాయి. ఆఖరికి





దురదృష్టవశాత్తు రారాజుకూ, ప్రతాపుడికీ మధ్యనే తీవ్రమైన అభిప్రాయభేదం వచ్చింది. ఇద్దరూ మాటకు మాట అనుకున్నారు. ఇంకేముందీ? మిగిలిన యోధులు కూడా రెండు జట్లుగా చీలిపోయి, ఆ అన్నదమ్ములలో ఎవరో ఒకరి పక్ష మయ్యారు. మర్నాడు ఉదయం సగం మందిమి పడవలలో ఎక్కి ప్రతాపుడి వెంట బయలుదేరాం; మిగిలిన సగంమంది రారాజు వెంట దేవతల నారాధించడానికి ఉండి పోయారు. మేము టెనెడోస్ చేరగానే మీ నాన్న వెనక్కు తిరిగి పోతానన్నాడు. అతని వెంట కొందరు బయలుదేరారు. నేనూ, దేవమయుడూ, మరికొందరూ సూటిగా ఇళ్ళకు చేరుకున్నాం. ఇదే జరిగింది. నాయనా, నాకు మిగిలినవారి సంగతి తెలియదు. వజ్రకాయుడి కొడుకు నవయోధుడూ, అతని అనుచరులూ క్షేమంగా చేరారని విన్నాను. మరికొంతమంది కూడా వారి వారి దేశాలకు క్షేమంగా చేరుకున్నట్టు తెలిసింది.

రారాజు స్వదేశానికి చేరుకోవడమూ, అజబలుడు రారాజు భార్యతో కుట్ర చేసి, ఆయనను దారుణంగా హత్య చేయడమూ నువ్వు వినే ఉంటావు. రారాజు కొడుకు గట్టివాడు. అవకాశం సంపాదించి అజబలుణ్ణి చంపేసి తన తండ్రి హత్యకు పగతీర్చు కున్నాడు."

ధీరమతి నవద్యోతుడితో, "అతను ఎంత అదృష్టవంతుడు! మా అమ్మను పెళ్ళాడే ఉద్దేశంతో మా ఇంట తిష్ట వేసి మా కొంప గుల్ల చేస్తున్న దుర్మార్గులపై నేనెప్పుడు పగ తీర్చుకుంటానో గదా!" అన్నాడు బాధగా నిట్టూర్చుతూ.

"అవును, నాయనా, మీ ఇంట చేరిన దుర్మార్గుల సంగతి నేనూ విన్నాను. నువ్వు వారిని ఎందుకు సహిస్తున్నావు? అందరూ నీకు శత్రువులేనా? అయినా ఆ బుద్ధిమతీ దేవి అనుగ్రహం నీపై ప్రసరిస్తే మీ నాన్నలాగే నువ్వు కూడా శత్రువులనందరిని నిర్మూలించ గలుగుతావులే!" అన్నాడు నవద్యోతుడు.

వారు మాట్లాడుతూ ఉండగానే పొద్దు వాలింది. ధీరమతి తన నౌకకు తిరిగి పోవ

టానికి లేచాడు. కాని నవద్యోతుడు ఒప్పుకో లేదు. "ఈ రాత్రి రూపధరుడి కొడుకు పడ వలో పడుకోవడమా? నాకు ఇల్లు లేదా? పక్కలూ, మెత్తలూ లేవా?" అంటూ ఆయన ఆప్యాయంగా ధీరమతిని తన ఇంటికి తీసుకుపోయాడు.

సహనుడు మాత్రం మిగిలిన నావికుల క్షేమసమాచారాలు చూడటానికి నౌకకు తిరిగి వెళ్ళాడు.

మర్నాడు ఉదయం ధీరమతి నిద్రలేచి సుఖంగా స్నానం చేసి బట్టలు మార్చుకున్నాడు. అతనిని ప్రతాపుడుండే చోటికి తీసుకు పోవడానికి ఒక గుర్రపుబండి సిద్ధం చేశారు. దారిలో తినడానికి భోజనం వెంటబెట్టుకుని నవద్యోతుడి కుమారుడు ఒకడు ధీరమతి వెంట బండిలో వచ్చాడు. వారిద్దరూ ఆ రోజు, మర్నాడు ప్రయాణం చేసి ప్రతాపుడుండే దేశం చేరుకున్నారు.

సరిగ్గా ఆ సమయానికే ప్రతాపుడు తన కుమార్తెను వజ్రకాయుడి కొడుకుకిచ్చి పెళ్ళి చేస్తున్నాడు. ఈ పెళ్ళికి పరిసర ప్రాంతాల నుంచి చాలామంది వచ్చారు. ఒక విశాలమైన సావడిలో విందులూ, వినోదాలూ జరుగు తున్నాయి. ఇంతలో ప్రతాపుడి అంగరక్షకు డొకడు వచ్చి, "మహారాజా, ఎవరో ఇద్దరు యువకులు బండిలో వచ్చి దిగారు. వారిని లోపలికి ఆహ్వానించ మన్నారా, లేక మరెక్కడి కైనా వెళ్ళమని చెప్పనా?" అని అడిగాడు.



ప్రతాపుడు చిరాకుతో, "నువ్వు ఇంత మూర్ఖుడివని నాకు తెలియదే! మనం పరాయి దేశాలలో దిక్కులేని స్థితిలో ఎన్నిసార్లు ఇతరుల ఆతిథ్యం తీసుకోలేదు? వెంటనే వెళ్ళి ఆ యువకులను భోజనానికి రమ్మను," అన్నాడు.

తరవాత కాస్సేపటికి ధీరమతీ, అతని అనుచరుడూ విందు జరిగే సావడిలోకివచ్చి ఆశ్చర్యంతో చుట్టూ కలియజూశారు.

ఆ సావడిలో సూర్యచంద్రులు ప్రకాశిస్తు న్నట్టుగా ఉన్నది. నౌకర్లు వచ్చి వారిని తీసు కుపోయి స్నానాలు చేయించి, బట్టలుకట్టబెట్టి, ప్రతాపుడి సరసనే వారిద్దరినీ భోజనానికి కూచోబెట్టారు. ప్రతాపుడు వారితో, "నాయన లారా, మిమ్మల్ని చూస్తే రాజకుమారులల్లే

ఉన్నారు గాని సామాన్యులలాగా లేరు. ముందు భోజనాలు చెయ్యండి; మీరెవర్లో, ఏం పనిమీద వచ్చారో తరవాత చెబుదురు గాని," అన్నాడు.

ఇద్దరూ భోజనం పూర్తిచేశాక ధీరమతి తన అనుచరుడి చెవిలో రహస్యంగా, "ఇక్కడ ఎంత కంచూ, ఎంత వెండీ, ఎంత బంగారమూ, ఎంత దంతమూ ఉందో చూశావా?" అన్నాడు. ఈ మాటలు ప్రతాపుడి చెవుల పడ్డాయి. "నాయనలారా, నేనీ సంపద యావత్తూ నానాదేశాలు తిరిగి సంపాదించాను. కాని ట్రోయ్‌కోట గోడల ముందు నా అనుచరులు ఎందరో ప్రాణాలు విడిచారు; వారు బ్రతికి ఉంటే ఈ సంపద లేకపోయినా నేను ఎక్కువ సుఖపడుదును. వారి కోసం నేను అప్పు డప్పుడూ ఏడుస్తాను. అయితే అందరి కన్నా నేను అధికంగా ఏడ్చేది రూపధరుడి కోసం. ఒక్కొక్కరాత్రి అతను జ్ఞాపకం వచ్చి నేను నిద్రపోలేను. నా సంగతే ఇలా ఉంటే, వృద్ధుడైన అతని తండ్రీ, అతని భార్యా, కుమారుడూ రూపధరుడి కోసం ఎంతగా ఏడుస్తున్నారో!" అన్నాడు ప్రతాపుడు విచారంగా.

ఈ మాటలు వినగానే ధీరమతికి దుఃఖం ఆగలేదు. అతను కళ్ళు తుడుచు కుంటున్న సమయంలో భువనసుందరి అక్కడికి వచ్చింది.

ధీరమతిని చూస్తూనే ఆమె, "ఈ కుర్ర వాడెవరో గాని మూడుమూర్తులా రూప



ధరుడి లాగే ఉన్నాడుకాదూ?" అన్నది. "నిజమే సుమా!" అన్నాడు ప్రతాపుడు ధీర మతికేసి చూస్తూ.

నవద్యోతుడి కొడుకు ప్రతాపుడితో, "మహారాజా! మీరన్నది నిజమే. ఇతను రూపధరుడి కుమారుడే. రూపధరుడు లేని కారణం చేత పాపం అతని ఇల్లు కుక్కల దొడ్డిలాగా అయింది. అతను పెద్ద చిక్కులో ఉన్నాడు. మీరేమైనా అతనికి తగిన సలహా సహకారాలివ్వ గలరేమోనని మా నాన్నగారు నవద్యోతుడు నా వెంట ఈ కుర్రవాణ్ణి మీ వద్దకుపంపారు," అన్నాడు.

"రూపధరుడి కొడుకు నా ఇంటికి రావటం ఎంత చిత్రం!" అన్నాడు ప్రతాపుడు. తరవాత రూపధరుణ్ణి గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు.

రూపధరుడు తన ఒంటినిండా దెబ్బ వాతలు వేయించుకుని, గ్రీకు శిబిరం నుంచి పారిపోయిన బానిస రూపంలో ట్రోయ్ నగరం ప్రవేశించటమూ, అలా మారురూపంలో ఉన్నప్పటికీ తాను అతనిని గుర్తించటమూ గురించి భువనసుందరి చెప్పింది. తామంతా కొయ్యగుర్రంలో కూర్చుని ఉన్నప్పుడు భువనసుందరి వచ్చి లోపల ఉన్నవారిని పేరు పేరునా పిలిచినప్పుడు, వారిలో కొందరు బయట పడబోతూండగా రూపధరుడు వారించిన వృత్తాంతం ప్రతాపుడు చెప్పాడు.

అప్పుడు ధీరమతి, "మహారాజా! మా తండ్రి వార్తలు మీకేమైనా తెలుసునేమో కనుక్కుందామనే ఉద్దేశంతో నేను వచ్చాను. మీకు తెలిసినదేమైనా ఉంటే దాచకుండా చెప్పండి," అన్నాడు.

"నాకు తెలిసినది చెబుతాను విను. నేను ఈజిప్టు దేశంలో చిక్కుకుపోయిన సమయంలో నాకు సముద్రాల మీద ఉండే ముసలాడు తటస్థపడ్డాడు. ఆయన నాకు అనేక మందిని గురించి చెపుతూ, రూపధరుడు తన అనుచరులందరినీ కోల్పోయి, దిక్కుతెలియని ఏదో ఒక దీవిలో బందీగా సమ్మోహినికి చిక్కి ఉన్నాడని తెలిపాడు," అన్నాడు. — (ఇంకా ఉంది)



# చందమామ కబుర్లు

## అతి వింత నవ్వు

సుప్రసిద్ధమైన 'గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్'లాగే రిప్లేస్ సంస్థ ప్రపంచం నలుమూలలలో జరిగే వింత వింత విశేషాలను, సంఘటనలను సేకరించి, "రిప్లేస్ బిలీవ్ ఇట్ ఆర్ నాట్" అనే పుస్తకం ప్రచురిస్తున్నది. ఆ పుస్తకంలో నమ్మశక్యం కాని విషయాలు చాలా ఉంటాయి. ఇప్పుడు రిప్లేస్ సంస్థ అమెరికాలోని హాస్య ప్రియులైన టెక్సాస్ నగర పౌరులకు ప్రత్యేకంగా ఒక నవ్వుల పోటీ ఏర్పాటు చేస్తున్నది. అతి వింతగా నవ్విన వారికి బహుమతి 150 డాలర్లు (దాదాపు 15,000 రూ). పోటీలో పాల్గొనదలచిన వాళ్ళు, రిప్లేస్ నవ్వుల పోటీ నెంబరుకు ఫోన్ చేసి, నవ్వడం ప్రారంభించాలి. ఆ నవ్వు అప్పటికప్పుడే అవతలి చివర రికార్డు చేయబడుతుంది. వారిలో మరీవింతగా నవ్వినవారికి బహుమతి అందజేస్తారు.

## కోర్టుకు వెళ్ళిన కుక్క

అమెరికాలోని లాస్ఏంజెలెస్‌లో హెరాల్డ్ మార్ష్ అనే న్యాయవాది 'డెవిల్ మార్ష్' అనే కుక్కను మూడేళ్ళుగా పెంచుతున్నాడు. ఆయన హొటల్‌కు వెళ్ళేప్పుడు ఆ కుక్కను వెంట బెట్టుకుని వెళ్ళేవాడు. ఒకనాడు హొటల్ యజమానులు కుక్కను తీసుకురావడానికి అభ్యంతరం తెలియజేశారు. హొటల్‌లోకి కుక్కలను అనుమతించరాదని ఆరోగ్యశాఖాధికారులు చెప్పారట. అంతే! తన కుక్క తరపున లాయర్ హెరాల్డ్ మార్ష్ కోర్టులో కేసు పెట్టాడు. "కుక్క దాదాపు 10,000 సంవత్సరాలుగా మనిషితో పాటు తింటూ, తిరుగుతూ, నిద్రపోతూ సహజీవనం సాగిస్తున్నది. పిచ్చికుక్క కరిస్తే 'రాబీస్' వస్తుంది తప్ప, మామూలు కుక్కల ద్వారా ఎటువంటి వ్యాధులూ వ్యాపించినట్టు దాఖలాలు లేవు," అని వాదిస్తున్నాడా న్యాయవాది!

## క్యాలండర్ రికార్డ్

మూడు విలక్షణమైన సంకలనాలు కలిపితే దాదాపు 2,500 పేజీలు ఉన్నాయి. ఈ పుస్తకాలకు ఉపయోగించిన కాగితం ఖరీదు 5,000 రూపాయలు. ఈ మూడు పుస్తకాలు ఒకే కాపీ మాత్రమే ఉన్నది. ఈ పుస్తకంలోని విషయం ఏమనుకుంటున్నారు? క్యాలండర్! క్రీ॥ శ॥ 1వ సంవ॥ నుంచి 10,000 సంవత్సరం వరకు గల రోజుల, తారీఖుల వివరాలు ఇందులో ఉన్నాయి. 9999 సం॥ జూన్ 1వ తేదీ ఏ రోజు వస్తుందో తెలుసుకోవాలని ఉన్నదా? ఈ క్యాలండర్ మూడవ వాల్యూమ్ తిరగేస్తే తెలిసిపోతుంది. బ్రహ్మాండమైన ఈ క్యాలండర్‌ను మద్రాసు నగరంలోని వెస్ట్‌మాంబళానికి చెందిన కుమార్ అనే యువకుడు తయారు చేశాడు. 10,000 క్యాలండర్లు రాయడానికి అతడికి 48 రోజులు పట్టింది. జిల్లా కలెక్టర్, రోటరీ క్లబ్, లయెన్స్ క్లబ్, జూనియర్ ఛాంబర్ ప్రతినిధుల సమక్షంలో కుమార్ దీనిని పూర్తి చేశాడు. ఆ ప్రముఖులిచ్చిన యోగ్యతా పత్రాల ఆధారంగా అతడు గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్సులో స్థానం సంపాదించాడు!






# శాపాలు - దీవెనలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో, కఠోరమైన పని కల్పించినవాడెవడై వుంటాడో నాకు తెలియడం లేదు. ఒకవేళ అతడు, నీవెంతగానో గౌరవించే గురువు గానీ లేక ప్రేమాస్పదుడైన తండ్రిగానీ అయిఉండడు కదా! ఎందుకంటే గురువు శిష్యుణ్ణీ, తండ్రి కొడుకునూ ఒక్కొక్కసారి అనాలోచితంగా శ్రమకు గురి చేస్తూంటారు. ఇందుకు కారణం వాళ్ళు తమ శిష్యులా,కొడుకులాఅనుభవాలను చూసి కూడా సరైన నిర్ణయాలు తీసుకోక పోవడం. దీనికి ఉదాహరణగా, విశ్వదత్తుడనే గొప్పవ్యాపారి కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



సూర్యాపురంలో విశ్వదత్తుడనే గొప్ప వ్యాపారి వుండేవాడు. ఆయనకు ధనదత్తుడు ఒక్కగానొక్క కొడుకు. వాడు తెలివైనవాడేకానీ, దుడుకు స్వభావం కలవాడు. తండ్రి వ్యాపారం చేస్తూంటే వాడు డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెడుతూ, క్రమంగా దురలవాట్లకు లోనయ్యాడు.

ఒకరోజున విశ్వదత్తుడు కొడుకును పిలిచి, "నాయనా! ఎదిగిన కొడుకు స్నేహితుడితో సమానమంటారు. కాబట్టి నేను నీకు నీతి బోధలు చేయను. అయితే నీ బుద్ధి పెడదారి తొక్కినందుకు నాకు బాధగా వుంది. అడిగిన దంతా ఇస్తూండడం వల్ల, నీకు డబ్బువిలువ తెలియడం లేదు. ఇక మీదట నీ అవస రాలకు సరిపడ డబ్బు నువ్వే సంపాదించుకో," అన్నాడు.

ఇందుకు ధనదత్తుడు సరేనన్నాడు. వాడికి వ్యాపారం చేయాలని వుంది కానీ, పెట్టుబడి గురించి తండ్రి నడగడం ఇష్టంలేదు. వ్యాపారం చేస్తున్న మిత్రులనడిగితే, వ్యాపారంలో భాగస్తుడుగా చేర్చుకునేటందుకు పెట్టుబడి డబ్బు తీసుకొని రమ్మన్నారు. చివరకువాడు సిగ్గువిడిచి, తండ్రినే పెట్టుబడి డబ్బు ఇమ్మని కోరాడు.

విశ్వదత్తుడు వాడితో, "అందరూ వ్యాపా రానికి పనికిరారు. వ్యాపారం చేతనైన వాడికి తెలివే పెట్టుబడిగా పనిచేస్తుంది," అన్నాడు.

"అవసరం పడితే, తెలివినే నేనూ పెట్టు బడిగా ఉపయోగించ గలను. కానీ నాకు డబ్బున్న తండ్రి ఉన్నాడు.నువ్వు నాకువెయ్యి వరహాలివ్వు. కావాలంటే ఋణపత్రం రాసి స్తాను.నీ బాకీ వడ్డీతో సహా ఏడాదిలోగా తీరు స్తాను," అన్నాడు ధనదత్తుడు పౌరుషంగా.

"నీకు నా డబ్బు కావాలంటే, ముందుగా నువ్వు నీ తెలివిని ఋజువు చేసుకోవాలి. అందుకు ఒక పరీక్ష పెడతాను," అన్నాడు విశ్వదత్తుడు.

సూర్యాపురానికి ఐదామడల దూరంలో వున్న రమణపురంలో కరటకుడు, దమనకుడు అనే వ్యక్తులున్నారు. వాళ్ళకు అద్భుత శక్తు లున్నాయని అంతా చెప్పుకుంటారు. కొత్తగా ఏ పని తలపెట్టిన వారయినా సరే, అరు

మాసాల పాటు వారిద్దరిలో ఎవరికి శుశ్రూష చేసినా మేలు జరుగుతుందనీ, అనుకున్నది సాధించవచ్చనీ అంటారు.

విశ్వదత్తుడు కొడుక్కు ఈ విషయం చెప్పి, "నువ్వు రమణపురం వెళ్ళు. ఆరునెలలు కరటకుణ్ణీ, ఆరునెలలు దమనకుణ్ణీ సేవించి ఇద్దరి దీవెనలూ పొందు. తిరిగి వచ్చాక ఇద్ద రిలో ఎవరు మంచివాడో చెబితే, నీ తెలివి ఎలాంటిదో నేను అంచనా వేస్తాను. చాలా మంది కరటకుడు దుష్టుడనీ,శపిస్తాడనీచెప్పు కుంటారు. దమనకుడు మంచివాడనీ, దీవి స్తాడనీ అంటారు. ఇందులోని నిజం నీద్వారా తెలుసుకోవాలని వుంది," అన్నాడు.

ధనదత్తుడు దీనికి సరే అని రమణపురం బయల్దేరాడు. తండ్రి వాడికి రాగికానీ కూడా ఇవ్వలేదు. అయితే, ఆయన పేరు చెబితే చాలు– ఏదైనా వాడికి లభించేలా చేశాడు.

ముందుగా ధనదత్తుడు, కరటకుడింటికి వెళ్ళాడు. ఆయన వాడు వచ్చినపని తెలుసు కుని, "నువ్వు నా సేవకుడివి కావు; మిత్రు డివి. నీకే సందేహాలు కలిగినా అడిగి తెలు సుకో. ఎటొచ్చీ నాకు కోపం మాత్రం తెప్పిం చకు. నేను తిట్టానంటే,అచ్చంఅలాగే జరుగు తుంది," అన్నాడు.

కరటకుడికి రాముడనే కొడుకు, దమ యంతి అనే కూతురు వున్నారు. వాళ్ళు వయసులో ధనదత్తుడి కంటే చాలా చిన్నవాళ్ళు. ఎన్నో విషయాలు ధనదత్తుడినడిగి తెలుసు



కునేవారు. ధనదత్తుడేం చెప్పినా,వాళ్ళకుఎంతో కొత్తగానూ, వింతగానూ, కుతూహలంగానూ వుండేది. వాడేం చెప్పినా వాళ్ళు పూర్తిగా నమ్మే వారు. కొన్నాళ్ళకు వాడు చెప్పిందే చేసే స్థితికి కూడా వచ్చారు.

ఇలా ఉండగా – కరటకుడు ధనదత్తుడికి ఎన్నో వ్యాపార సూత్రాలు చెప్పాడు. వస్తువు లెలా సేకరించాలో,ఏవేవి ఎక్కడెక్కడ అమ్మాలో, ప్రజలనెలా నమ్మించాలో- ఇలా రకరకాల పద్ధతులాయన చెబుతూంటే, ధనదత్తుడికి చాలా విషయాలు తెలిశాయి. వాడొక రోజున కరటకుడితో, "అయ్యా! మీ నుంచి చాలా విషయాలు తెలుసుకున్నాను.కానీ మీరు చెప్పి నవన్నీ సాధించాలంటే న్యాయం, నిజాయితీ



చేయాలనుకుంటున్నామనీ, ఇప్పటినుంచే ఈ పద్ధతులన్నీ నేర్చుకుంటామనీ అన్నారు.

తమ పిల్లలలో వస్తున్న మార్పును గమనించిన కరటకుడు, వాళ్ళను నిలదీసిఅసలు సంగతి తెలుసుకున్నాడు. ఆయన ధనదత్తుణ్ణి పిలిచి, "నేను నీకు చక్కని సలహాలిచ్చి సాయం చేస్తూంటే నువ్వు చెడు సలహాలతో నా పిల్లలను పాడు చేస్తున్నావు. ఇది నీకు తగదు!" అన్నాడు.

దానికి ధనదత్తుడు, "అయ్యా! మీరు నాకిచ్చిన సలహాలనే నేను మీ పిల్లలకిచ్చాను.అవి చెడ్డవెందుకవుతాయి?" అన్నాడు.

కరటకుడు కోపంగా, "వ్యాపారం దగా, మోసం, కుట్రా. అందుకని, నా పిల్లలు వ్యాపారం చేయడం నాకిష్టం లేదు," అన్నాడు.

"వ్యాపారం దగా, మోసం కుట్రా అని నన్నెందుకు హెచ్చరించలేదు?" అని అడిగాడు ధనదత్తుడు చిరాకు పడుతూ.

"అయితే విను. ఈ ప్రపంచానికి వ్యాపారుల అవసరమెంతో వుంది. అందువల్ల ఇతరులను నేను వ్యాపారానికి ప్రోత్సహిస్తాను. నా పిల్లలు వ్యాపారస్థులు కావడం మాత్రం నాకిష్టం లేదు. కాబట్టి వాళ్ళ మనసు మార్చు," అన్నాడు కరటకుడు.

"ఇతరులకొక న్యాయం, తమ పిల్లలకొక న్యాయం అని తమరనడం నాకు నచ్చలేదు. మీకు వ్యాపారస్థుల అవసరం వున్నప్పుడు మీ పిల్లలు వ్యాపారస్థులు కావలసిందే!" అన్నాడు

విడిచిపెట్టాలి. అధర్మం అమలు చేయాలి. అలా కాకుండా ఇంకేదైనా ఉపాయముందా?" అన్నాడు.

"వ్యాపారంలో రాణించాలనుకుంటే అబద్ధాలు నేర్చుకోవాలి. అయినవాళ్ళనుకూడా మోసం చేయాలి. మంచితనం నటించాలి. న్యాయం, ధర్మం, నిజాయితీల గురించిఆలోచించకూడదు. రాజశాసనానికి దొరక్కుండా మాత్రం జాగ్రత్త పడితే చాలు, ఎన్ని తప్పులైనా చేయవచ్చు," అన్నాడు కరటకుడు.

ఇది ధనదత్తుడికి బాగా వంటబట్టింది. వాడొకనాడు సాయంత్రం రాముడికీ, దమయంతికీ ఈ విషయం చెప్పాడు. వాళ్ళెంతో ఉత్సాహపడి, పెద్దయ్యాక తామూ వ్యాపారం

ధనదత్తుడు. ఇది వింటూనే కరటకుడు ఆగ్రహంతో, "మూర్ఖుడా! ఇక నీ ముఖం నాకు చూపకు. నీకు ప్రతిరోజూ అశుభం జరగాలని శపిస్తున్నాను," అన్నాడు.

ధనదత్తుడు నిర్లక్ష్యంగా నవ్వి, అక్కడి నుంచి బయటపడ్డాడు. అయితే, అలా వీధిలోకి వచ్చాడో లేదో అరటిపండు తొక్క మీద కాలువేసి జారిపడ్డాడు. వాడు లేవలేక అవస్థ పడుతూంటే దారిన పోతున్న ఒకవ్యక్తి వాడిని లేవదీసి వైద్యుడి వద్దకు చేర్చాడు. వైద్యుడు వాడి కాలుకు బెణుకు పోయే పసరు పూసి, ఇంతగా ఎలా పడ్డావని అడిగాడు. ధనదత్తుడు జరిగింది వివరంగా చెప్పాడు.



"అయ్యో! కరటకుడు నిన్ను శపించాడా! అయితే నీకు రోజూ ఏదో ఒక ప్రమాదం తప్పదు. వెళ్ళి, ఆయన శరణు వేడు," అన్నాడు వైద్యుడు.

"నేను శాపాలను నమ్మను. చాలామొండివాణ్ణి. అవసరం అయితే ప్రతిరోజూ మీ దగ్గరకు వచ్చి వైద్యం చేయించుకుంటాను తప్ప, కరటకుణ్ణి శరణు వేడను," అన్నాడు ధనదత్తుడు.

వైద్యుడు కొంచెంసేపు ఆలోచించి, "నీకు ఎంతకాలమైనా ఉచితంగా వైద్యం చేయమని, నాకు సూర్యాపురం నుంచి విశ్వదత్తుడిఆజ్ఞ. కానీ, ఉత్తపుణ్యాన ఆరోగ్యమెందుకు పాడు చేసుకుంటావు? నా మాట విని, దమనకుణ్ణి ఆశ్రయించు. నీకే ఇబ్బందీ వుండదు," అన్నాడు.

"నేనిప్పుడు దమనకుడి ఇంటికే వెళుతున్నాను. ఆయన నన్ను ఆదరిస్తాడా?" అని అడిగాడు ధనదత్తుడు అనుమానంగా.

"వీధిలోంచి నిన్ను లేపి, నా దగ్గరకు తీసుకుని వచ్చింది ఎవరనుకున్నావు? దమనకుడే! ఆయన పరోపకారి. అందరినీ ఆదరిస్తాడు. దీవించడమే తప్ప, శపించడం ఎరుగనివాడు," అన్నాడు వైద్యుడు.

ధనదత్తుడు దమనకుడి ఇంటికి వెళ్ళి, తననుతాను పరిచయంచేసుకుని, జరిగినదంతా చెప్పాడు. దమనకుడు వాడితో, "నాయనా! వ్యాపారంలో ప్రజాసేవ, పరోపకారం



వున్నాయి. కానీ, అనుభవంతోనే అది రాణిస్తుంది. నువ్వు వ్యాపారం ఇక్కడే ప్రారంభించు. పెట్టుబడి నేను పెడతాను. లాభాలు సమంగా పంచుకుందాం. నీకిష్టమేనా?" అని అడిగాడు.

ఆ మాటలకు ధనదత్తు డాశ్చర్యపడి, "అయ్యా, తమరెంతో మంచివారని విన్నాను. వ్యాపారానికి నన్నెందుకు ప్రోత్సహిస్తున్నారు?" అన్నాడు.

దమనకుడు నవ్వి, "వైద్యుడు వైద్యం చేసినందుకు డబ్బు తీసుకుంటాడు. గాయకుడు పాట పాడి డబ్బు తీసుకుంటాడు. వ్యాపారి వస్తువులు సరఫరాచేసి డబ్బు తీసు కుంటాడు. ఆహార పదార్థాలు కల్తీ చేయడం, అమాయకుల డబ్బు కాజేయడం వంటివి చేయకపోతే, మిగతావన్నీ వ్యాపారంలో తప్పు కాదు. అందుకే నీ వ్యాపారంలో నేను భాగస్వామినవుతున్నాను," అన్నాడు.

ధనదత్తుడికీ మాటలు నచ్చాయి. వాడు వెంటనే వ్యాపారం ప్రారంభించాడు. దమనకుడి దీవెనల ఫలితమో ఏమో నెల్లాళ్ళలోనే వాడి దశ తిరిగింది. నాలుగునెలల్లో వ్యాపారం బాగా పుంజుకున్నది.

దమనకుడు, ధనదత్తుడికి పెట్టుబడిగా వెయ్యి వరహాలిచ్చాడు. మొదటి నెలలో వాడికి ఐదువందల వరహాలు లాభం వచ్చింది. అందులో సగం దమనకుడి కిచ్చాడు. రెండో నెలలో వెయ్యి వరహాల లాభం వచ్చింది. అందులో సగం దమనకుడికిచ్చాడు. ఇలా ప్రతినెలా లాభం పెరుగుతూనే ఉన్నది.

నాలుగు నెలలు గడిచాక ధనదత్తుడు ఒక విషయం గ్రహించాడు. ఈ కొద్ది వ్యవధిలోనే దమనకుడికి తన నుంచి పదిహేను వందల వరహాలు ముట్టాయి. దమనకుడు ఇరవైశాతం వడ్డీకిచ్చినా, ఆయన డబ్బు ఏడాదిలో పన్నెండు వందల వరహాలు మాత్రమే అయ్యేది.

ధనదత్తుడొక రోజున దమనకుడితో, "అయ్యా! తమరిచ్చిన పెట్టుబడికి వడ్డీడబ్బు కూడా తమకు ముట్టింది. కాబట్టి, ఇక మీదట నా వ్యాపారంలో వాటా అడగకండి!" అన్నాడు.

దమనకుడు చిరాకు పడి, మనం వ్యాపారంలో భాగస్వాములం. పెట్టుబడి నాది. లాభాలు చెరిసగం. ఆ ఒప్పందం మారదు. నువ్వు వ్యాపారం చేసినంతకాలం లాభంలో నాకు వాటా ఇస్తూండవలసిందే," అనిఖచ్చితంగా చెప్పాడు.

"మన ఒప్పందంలోని మోసం నా కిప్పుడర్థమైంది. అదృష్టం కొద్దీ అప్పుడు పత్రాలు రాసుకోలేదు.కాబట్టి మన ఒప్పందానికి సాక్ష్యంలేదు. ఇక మీదట నేను మీ మొహంచూడను.మీరు నాతో మాట్లాడకండి," అన్నాడు ధనదత్తుడు.

"అయితే ఇక మీదట నీకు జరిగే కష్టనష్టాల బాధ్యత నాది కాదు!" అన్నాడుదమనకుడు.

ధనదత్తుడు మారుమాట్లాడకుండా, అలా వీధిలోకి వచ్చాడో లేదో అరటిపండు తొక్క మీద కాలువేసి జారి పడ్డాడు. ఎవరో వాణ్ణి వైద్యుడి దగ్గరకు చేర్చారు. వైద్యుడు వాడి కాలి బెణుకు పోయేలా పసరు పూసి, "కరటక, దమనకులకు వాక్శుద్ధి వుంది. అది ఈ రమణపురానికే పరిమితం. కాబట్టి నువ్వు వెంటనే ఊరు విడిచిపో!" అని సలహా ఇచ్చాడు.

ధనదత్తుడు వెంటనే ఊరువిడిచి, సూర్యాపురం వెళ్ళి తండ్రికి జరిగినదంతా చెప్పి,"కరటకుడు, దమనకుడు ఇద్దరికిద్దరూ స్వార్థపరులు, దుష్టులు. ఇద్దరూ నన్ను శపించారు," అన్నాడు.



వెంటనే విశ్వదత్తుడు, "నీ తెలివి ఏపాటిదో నాకు తెలిసిపోయింది. నువ్వు వ్యవసాయానికో, పశుపోషణకో తప్ప వ్యాపారానికి పనికిరావు!" అన్నాడు

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విశ్వదత్తుడు కొడుకును వ్యాపారానికి పనికి రావనడం అనాలోచితం, తొందరపాటు నిర్ణయం కాదా? ధనదత్తుడు స్వానుభవం ద్వారా కరటక దమనకులిద్దరూ స్వార్థపరులూ, దుష్టులూ అని తెలుసుకున్నాడు. వాడి వల్ల తమకు ప్రయోజనం లేదని తెలుసుకున్న మరుక్షణాన, ఇద్దరూ వాణ్ణి శపించారు. కానీ, విశ్వదత్తుడి అభిప్రాయంలో, వాళ్ళల్లో ఒకడు మంచివాడన్న సూచన కానవస్తున్నది.

దుష్టులు దుష్టులే! వారిలో మంచి దుష్టుడూ, చెడ్డదుష్టుడూ అంటూ తరతమ భేదాలు కల్పించడం అసమంజసం, అసంబద్ధం అవుతుంది కదా? విశ్వదత్తుడు వంటి ఎంతో అనుభవశాలి అయిన వ్యాపారి కూడా కొడుకు విషయంలో ఇంత పెద్ద పొరపాటు ఎందుకు చేశాడు? ఈ సందేహాలకు సమాధానంతెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కరటకుడు దుష్టుడు. అందులో సందేహానికి తావులేదు. తను చెడ్డదని నమ్మే విషయాన్నే ఇతరులకు బోధించి ప్రయోజనం పొందాలనుకుంటాడు. కానీ దమనకుడలా కాదు. తను బోధించేది ఆచరిస్తాడు. వ్యాపారంలో ధనదత్తుడి సమర్థత ఏ పాటిదో తెలుసుకోకుండానే, వాడికివెయ్యి వరహాలు పెట్టుబడిగా ఇచ్చాడు. ఇది ఆయన మంచితనాన్ని చాటిచెపుతున్నది. ఆయన చల్లని దీవెనల కారణంగానే, ధనదత్తుడి వ్యాపారం రాణించి,లాభాలు వచ్చాయి. కరటక దమనకుల్లో, ధనదత్తుణ్ణి శపించినవాడు కరటకుడు. ధనదత్తుడు, దమనకుడితో పరిచయం చేసుకున్న మరుక్షణం నుంచీ, ఆయన దీవెనలు వాడిని కరటకుడి శాపం నుంచి కాపాడాయి. అయితే, ప్రలోభం కొద్దీ ధనదత్తుడు వ్యాపారంలో వస్తున్న లాభాలలో దమనకుడికి వాటా ఇవ్వడానికి నిరాకరించడమే కాక – మీరు నాతో మాట్లాడకండి, అంటూ ఆయనను కించపరిచాడు. దానితో ఆయన ధనదత్తుడిని దీవించడం మానేశాడు. ఆ మరుక్షణం ధనదత్తుడు వీధిలో కాలుజారి పడడం జరిగింది. అయినా వాడు ఇందుకు కారణం ఏమిటో నిశితంగా ఆలోచించక, తండ్రితో కరటక దమనకులిద్దరూ దుష్టులని చెప్పాడు.ఇది విన్న విశ్వదత్తుడు తన కుమారుడిలో వ్యాపారిగా వన్నె కెక్కగల ఆలోచనాశక్తి గానీ,దక్షతగానీ లేవని గ్రహించి, వాడికి వ్యవసాయానికో, పశుపోషణకో మాత్రం పనికిరాగలవని చెప్పాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమైతిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : శ్రీరామకమల్ రచన]



# కర్నాటకకు దక్షిణంగా..

రచన : మీరానాయర్ ◆ చిత్రాలు : గౌతమ్‌సేన్

గోవా సముద్రతీరం గుండా కిందికి వెళ్ళామంటే మార గోవా ఓడరేవు చేరుకుంటాము. మన దేశంలోని సహజమైన ఓడరేవులలో ఇది ఒకటి. ఎప్పుడూ హడావుడిగా కనిపించే ఈ రేవు నుంచి గోవాలో లభించే ఇనుము, మాంగనీసు మొదలైన ఖనిజ మిశ్రలోహాలను ఎగుమతి చేస్తారు.

మార గోవాకు సమీపంలో రాష్ట్రంలోకెల్లా అతి పెద్ద దయిన కోల్వా సముద్ర తీరం ఉన్నది. కోల్వా తీరంలో తెల్లటి ఇసుక కాబోడీరామా వరకు విస్తరించి ఉన్నది. శ్రీ రాముడు వనవాస కాలంలో ఇక్కడ కొన్నాళ్ళు గడిపాడని చెబుతారు. సముద్రతీరంలో 25 కి.మీ. దూరంలో శ్రీరాముడి బాణం పడిన చోటని చెప్పబడే 'బేనాలిమ్' గ్రామం ఉన్నది.




కోల్వాలోనే సుప్రసిద్ధమైన ఇగ్రేజా డీ నోసా సెన్హోరా పైడేడ్ చర్చ్ ఉన్నది. ఈ చర్చిలో బాల (మెనినో) ఏసు విగ్రహం ఉన్నది. దీనికి స్వస్థత సమకూర్చే అద్భుతశక్తి ఉన్నదని భక్తులు విశ్వసిస్తారు.

గోవాకు దక్షిణాగ్రంలో పోలేం బీచ్ ఉన్నది. గోవా- కర్నాటక సరిహద్దుకు కూతవేటు దూరంలో ఉన్న ఈ బీచ్‌కి పర్యాటకులు అంతగా రావడం లేదు.

పశ్చిమ సముద్రతీరంలోని కర్నాటక భూభాగాన్ని కూడా పరశురాముడే సముద్రం నుంచి పైకి తెచ్చాడని చెబుతారు. అందుకే దీనికి పరశురామ క్షేత్రం అనే పేరు కూడా వచ్చింది. ఈ



కోల్వా తీరం

సముద్రతీరంలో ఉత్తరంగా ఉన్న కార్వార్ చాలా సుందరమైన ప్రదేశం. దీనికి మూడు వైపులా సముద్రతీరం ఉన్నది.


కార్వార్

అన్ని ఋతువులకూ అనుకూలమైన, చాలా చక్కటి సహజమైన ఓడరేవు కార్వార్‌లో ఉన్నది. నైరుతి ఋతుపవనాల సమయంలో ఇది రక్షణనిస్తున్నది. ముంబాయి (బొంబాయి) నుంచి కొలంబోకు వెళ్ళే నౌకలు దీనిని సంవత్సరమంతటా ఉపయోగించుకోవచ్చు. ఈ రేవును అరబ్బులు బైట్-ఇ-కోల్ అని పిలిచేవారు. మిరియాలు, ఏలకులు, కసింద మొదలైన సుగంధ ద్రవ్యాలతో పాటు సన్నటి బట్టలు, ముతక నీలం బట్టల ఎగుమతికి కూడా ఈ రేవు ప్రసిద్ధి గాంచింది.

అందమైన ఈ పట్టణంలో 1883వ సం॥ వేసవిలో బస చేసినప్పుడే రవీంద్రనాథ టాగూర్ 'ప్రకృతిర్ ప్రతిశోధ్' అనే తన మొట్టమొదటి ముఖ్యమైన నాటకాన్ని రచించాడు. ఆ సమయంలో రవీంద్రనాథ టాగూర్ సోదరుడు సత్యేంద్రనాథ్ టాగూర్ కార్వార్ జిల్లా న్యాయమూర్తిగా ఉండేవాడు.

కార్వార్‌కు కొన్ని కి.మీ దూరంలో అంకోలా సముద్రతీర రేవుపట్టణం ఉన్నది. కాదంబులు, చాళుక్యులు, విజయనగర రాజుల కాలంలో ఇదొక ముఖ్యమైన వాణిజ్య కేంద్రంగా ఉండేది. మన దేశ స్వాతంత్ర్యోద్యమ సమయంలో


రవీంద్రనాథ టాగూర్


అంకోలాలో చాలా ఉద్యమాలు జరిగాయి

శ్రీ మహాబలేశ్వర ఆలయం

శ్రీ గంధం చెక్కతో
మలిచిన శిల్పం

ముఖ్యంగా - ఉప్పు సత్యాగ్రహం, పన్నుల నిరాకరణోద్యమం జరిగినప్పుడు అంకోలా ముఖ్యమైన పాత్ర వహించింది.

అంకోలాకు 8 కి.మీ దూరంలో హెన్నె బెయిల్ అనే ప్రసిద్ధమైన జైన గుహాలయాలు ఉన్నాయి.

కార్వార్‌కు 60 కి.మీ దూరంలో దక్షిణ కాశిగా ప్రసిద్ధి గాంచిన గోకర్ణ క్షేత్రం ఉన్నది. ఇదొక ముఖ్యమైన శివక్షేత్రం. ఇక్కడి మహాబలేశ్వర ఆలయంలో సుప్రసిద్ధమైన ఆత్మలింగం ఉన్నది. దీనిని రావణుడు ఇక్కడ వదిలి వెళ్ళాడని చెబుతారు. రావణాసురుడు అనేక సంవత్సరాలు ఘోరమైన తపస్సు చేసి సాధించిన ఆత్మలింగాన్ని విఘ్నేశ్వరుడు ఉపాయంతో నేలమీద పెట్టేలా చేశాడు. ఆ తరవాత దానిని రావణుడు పైకి ఎత్తలేకపోయాడు. అందుకే దానికి 'మహాబల' అనే పేరు వచ్చిందని ఒక పురాణ కథ చెబుతుంది. గర్భగృహంలో నేలమట్టానికి రెండంగుళాల ఎత్తులో మాత్రమే శివలింగం కనిపిస్తుంది. పన్నెండు సంవత్సరాలకు ఒకసారి జరిగే 'అష్ట బంధన' ఉత్సవ సమయంలో మాత్రమే లింగాన్ని త్రవ్వి పైకి తెచ్చి భక్తుల దర్శనానికి ఉంచుతారు.

దీనికి మరికొంత దిగువగా తాడిచెట్లు నిండిన తీరంలో శ్రీగంధం చెక్కల శిల్పాలకు పేరొందిన కుమ్టా పట్టణం ఉన్నది. కర్నాటక ప్రాంతంలో గుడిగార్లని ప్రసిద్ధి గాంచిన సంప్రదాయ శిల్పకారులు ఈ శిల్పాలను మలచడంలో సిద్ధహస్తులు.

ఈ పట్టణానికి కొద్దిదూరంలో ప్రాచీన కాలం

శిల్పం చెక్కుతున్న గుడిగార్

శరావతి-వంతెన



భట్కాల్
ఆలయంలోని
పాములవాడి శిల్పం



చంద్రనాథేశ్వర
ఆలయంలోని
చంద్రనాథ
తీర్థంకరుడు

నుంచి బంగారు పట్టణంగా ప్రసిద్ధిగాంచిన (హొనవార్,) హొన్నూరు ఉన్నది. రామాయణ కాలం నుంచే హొన్నూరు ఉండేదని చెబుతారు. ఇక్కడి 'రామతీర్థ'మనే నీటిబుగ్గను శ్రీరాముడే సృష్టించాడని చెబుతారు. హైదర్ అలీ కాలంలో ఇది నౌకా కేంద్రంగా ఉండేది. ఇది గొప్ప వ్యాపారకేంద్రంగా కూడా పేరుగాంచింది. ఇక్కడి శరావతి వంతెన కర్నాటక రాష్ట్రంలోకెల్లా చాలా పెద్దది.

ఉత్తర కన్నడ జిల్లా దక్షిణాగ్రంలోని భట్కాల్, బాసాడీలనే జైన ఆలయాలకు ప్రసిద్ధిగాంచింది. ఇక్కడ దాదాపు 13 ఆలయాలు ఉన్నాయి. వీటిలో 500 సంవత్సరాలకు పూర్వం నిర్మించబడిన చంద్రనాథేశ్వర బాసాడీ పెద్ద ఆలయం.



యక్షగాన నాటకారుడు

భట్కాల్‌కు 6 కి.మీ దూరంలో అడవులతో నిండిన నేత్రాణి ద్వీపం ఉన్నది. ఇక్కడ పావురాలు ఎక్కువగా ఉండడంతో ఆంగ్లేయులు దీనిని 'పావురాల దీవి' అన్నారు. ఈ దీవిలో 'స్విఫ్టలెట్' పక్షులు కూడా ఎక్కువగా ఉన్నాయి. వీటి గూళ్ళ నుంచి తయారు చేసే 'బర్డ్సనెస్ట్ సూప్'ను చైనావాళ్ళు చాలా ఇష్టంగా తాగుతారు.

పావురాల దీవికి దక్షిణంగా 'సూర్యపట్టణం'గా ప్రసిద్ధిగాంచిన కుందాపూర్ ఉన్నది. ఇది దక్షిణ కన్నడ జిల్లాలో ఉన్నది. కర్ణాటక సంప్రదాయానికి చెందిన నృత్య నాటక ప్రక్రియ యక్షగానానికి ఉత్తరాది రూపమైన 'బడగతిత్తు'కు ఈ ఊరు కేంద్రంగా ఉంటున్నది. ముద్దనగా ప్రసిద్ధిగాంచిన ప్రముఖ కన్నడ కవి నందలికె లక్ష్మీనారణప్ప, కుందాపూర్‌కు చెందినవాడే. ఆ ఊళ్ళోని ఒక ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో డ్రిల్లుమేస్టారుగా ఉద్యోగం చేస్తూన్నప్పుడే అందమైన ఆలంకారిక వచనంలో ఆయన 'శ్రీరామాశ్వమేధం' అనే గ్రంథం రచించాడు.



# గొప్పవాడు!

ధవళవరం గ్రామంలో ఆస్తిపరులైన రైతుల్లో నరసయ్య ఒకడు. ఆయనకు పరమేశం ఒక్కగానొక్క కొడుకు. వాడు పొరుగు గ్రామంలో వున్న గురుకులంలో ఐదారేళ్ళ పాటు విద్యాభ్యాసం చేసి ఇంటికి తిరగి వచ్చి, వ్యవసాయపు పనుల్లో తండ్రికి సాయపడుతూండేవాడు.

పరమేశం స్వభావతః మంచివాడే కానీ, నలుగురితో మాట్లాడేటప్పుడు, తన గురించి తానే గొప్పగా చెప్పుకునేవాడు. అలా చెప్పుకోవడం మంచి పద్ధతి కాదని తండ్రి, పరమేశానికి చాలాసార్లు నచ్చచెప్ప చూశాడు. అయితే, పరమేశం తండ్రి మాటల్ని కొట్టిపారేస్తూ, "నాలో లేనివి వున్నట్లుగా చెబితే తప్పు. నేను చెబుతున్నవన్నీ గురుకుల విద్యాభ్యాసం ద్వారా, నా స్వభావంలో జీర్ణించుకుపోయిన విషయాలే. అందువల్ల, నేను చెబుతున్నవి ఉన్న మాటలే గాని, లేనిపోని గొప్పలు కావు!" అంటూ వాదించేవాడు.

కొడుకుతో వాదించలేక నరసయ్య మౌనంగా వూరుకుని, తనలో తనే బాధపడేవాడు.

ఒకసారి నరసయ్య పనిమీద, తన బావ మరిది శేషయ్య వుంటున్న పొరుగూరు వెళ్ళాడు. అప్పుడు మాటల సందర్భంలో ఆయన తన కొడుకు వితండవాదం గురించి చెప్పి బాధ పడ్డాడు.

అంతా విన్న శేషయ్య, "వాడి గురించి నువ్వేం బాధపడకు, బావా! వాణ్ణి ఒక్కసారి నా దగ్గరకు పంపించు. వాడి బుద్ధికున్న ఆ కాస్త మచ్చా చెరిపేసి, అసలు గొప్పతనమంటే ఏమిటో తెలిసేలా చేస్తాను. ఎంతైనా వాడికి కాబోయే మామగారిని కదా!" అన్నాడు.

నరసయ్య ఇంటికి తిరిగి వెళ్ళాక పరమేశంతో, "శేషయ్యమామ నిన్నొకసారి పంపించమన్నాడు. ఆయనకు నీతో ఏదో ముఖ్యమైన పనున్నదట," అంటూ కొడుకుచేత ప్రయాణం కట్టించాడు.

లక్ష్మీగాయత్రి



శేషయ్య అంటే గౌరవమూ, భయభక్తులూ గల పరమేశం వెంటనే బయలుదేరి మామ దగ్గరికి వెళ్ళాడు. మేనల్లుడితో కాసేపు ఆ కబురూ, ఈ కబురూ చెప్పిన శేషయ్య, "పట్నంలో గోవిందశెట్టి అనే గొప్ప వర్తకుణ్ణి నువ్వెరుగుదువా?" అంటూ ప్రశ్నించాడు.

పరమేశం ఎరగనన్నట్టు తల ఊపాడు. శేషయ్య కొంచెంసేపు మౌనంగా వూరుకుని, "నాకు ఆయనతో పరిచయం లేదు గాని - ఇప్పుడాయనతో చిన్న పని పడింది. నిన్ను నాతోపాటు తీసుకువెళితే, ఆయన పరిచయం ముందు ముందు నీకేమైనా లాభించవచ్చునని రమ్మన్నాను. రేపే మనిద్దరం పట్నం వెళదాం!" అన్నాడు.

"నేను పరిచయం చేసుకోవలసినంత గొప్పవాడా ఆయన? ఏది ఏమైనా, నీ పని మాత్రం సానుకూలపడినట్టే అనుకో. ముక్కూ మొహం తెలియని వాళ్ళతోనైనా ఇట్టే మాట్లాడి, పని జరిపించుకోగల సామర్థ్యం నాకున్నది,!" అన్నాడు పరమేశం.

ఆ మాటలు విని శేషయ్య పెద్దగా నవ్వుతూ, "అలాగా! ఏదో ఒక విధంగా నా పని సానుకూలం కావడమే నాకు కావలసింది," అన్నాడు.

మర్నాడు ఉదయం బాడుగబండిలో మామా అల్లుళ్ళిద్దరూ బైలుదేరి, బారెడు పొద్దెక్కేవేళకు పట్నం చేరుకున్నారు. పట్నం చేరగానే ఒక చోట బాడుగబండిని ఆపించి శేషయ్య, పరమేశంతో, "గోవింద శెట్టిగారి ఇల్లు ఈ పరిసరాల్లోనే వుండాలి!" అంటూ బండిదిగి, బండివాడికి బాడుగ ఇచ్చి పంపేసి, ఎదురుగా కూరలతట్ట నెత్తిన పెట్టుకుని వస్తున్న ఒక ఆడమనిషిని ఆపి, "ఏమ్మా, గోవిందశెట్టిగారిల్లు ఎక్కడో తెలుసా?" అని అడిగాడు.

వెంటనే కూరలమనిషి నవ్వుమొహంతో, "ఆ ధర్మరాజిల్లు ఎక్కడో తెలియక పోవడమేమిటి, బాబూ! ఈ పట్నంలో చిన్న పిచిక పిల్లనడిగినా, ఆ బాబుగారిల్లు చూపిస్తుంది," అంటూ దారి చెప్పింది.

ఆ మనిషి చెప్పిన దారిలో పదడుగులు నడిచిన శేషయ్య, ఎదురుగా వస్తున్న ఒక పెద్దమనిషిని ఆపి, మళ్ళీ దారి అడిగాడు. ఆ పెద్దమనిషి కూడా ఎంతో ఆత్మీయంగా దారి

చెప్పి, "ఇంతకూ తమరెవరో తెలుసుకో వచ్చునా?" అంటూ మర్యాదగా ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు శేషయ్య కాస్త దీనంగా, "మేం పొరుగూరు వాళ్ళం. కాస్త ఇబ్బందుల్లో ఉండి, శెట్టిగారి దర్శనం కోసం వచ్చాం," అన్నాడు.

అది విని ఆ పెద్ద మనిషి మరింతఆదరంగా, "అలాగా, గోవిందశెట్టిగారిని కలుసుకోవట మంటే, మీ ఇబ్బందులు తీరినట్టే అనుకోండి. ఆయనలాంటి దయామయుడు ఇంకెక్కడా వుండడు. పడిపోబోతున్న నా వ్యాపారం తిరిగి నిలబడిందంటే, దానికి ఆయన మాటసహా యమూ, ఆర్థిక సహాయమే కారణం," అన్నాడు.

శేషయ్య, ఆయనకు నమస్కారం చేసి, మళ్ళీ నడక సాగించి, మరొక ఐదునిమిషాల్లో గోవిందశెట్టి ఇల్లు చేరాడు.

మామాఅల్లుళ్ళు వెళ్ళేసరికి, ఎవరో ముగ్గురు పెద్దమనుషులతో మాట్లాడుతున్న గోవిందశెట్టి, శేషయ్యను చూస్తూనే లేచి ఎదురు వచ్చి సాద రంగా ఆహ్వానిస్తూ, "రండి! రండి! ఈ మధ్య చాలా రోజులుగా రావటం మానేశారేం?" అంటూ ఆప్యాయంగా ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే పరమేశం తెల్లబోగా, శేషయ్య మాత్రం చిరునవ్వుతో, "ఏదో కొంత అనారోగ్యంగా వుండి రాలేకపోయాను. మీరు కుశలమే గదా!" అన్నాడు.

గోవిందశెట్టి చిరునవ్వుతో తల ఊపి ముందుకు నడిచాడు. అంతలో అక్కడున్న వాళ్ళలో ఒకడు, శేషయ్యను పలకరించి,



పరమేశం కేసి చూస్తూ, ఎవరన్నట్టు తల పంకించాడు.

"వీడా!మా నరసయ్యబావ కొడుకు. నాకు కాబోయే అల్లుడు. పరమేశం," అన్నాడు శేషయ్య.

"ఓహో,పరమేశమా! మా అబ్బాయి గురు కులంలో చదివే రోజుల్లో, మీ వాణ్ణి బాగా ఎరుగును లెండి. చుట్టుపక్కల పదామడల దూరంలో వున్న గొప్పవాళ్ళందరి కంటే, గొప్ప వాణ్ణని మాట్లాడేస్తుంటాడట! ఆ లెక్కన, మన శెట్టిగారి కంటే గొప్పవాడట కదా, మీ అల్లుడు!" అంటూ ఆయన వెటకారంగా నవ్వాడు. ఎక్కడా దాపరికం లేని ఆ వెటకారం, పరమేశం మనసుకు చుర్రున వాత పెట్టినట్టే అనిపించింది. భోజనాలవేళ కాగానే మామా

అల్లుళ్ళిద్దరూ శెట్టి సహపంక్తిన విందుభోజనం చేశారు. కొంతసేపు విశ్రాంతి తీసుకున్న తర వాత శెట్టి దగ్గర సెలవు తీసుకుని తిరుగు ప్రయాణమయ్యారు.

తిరుగుప్రయాణంలో పరమేశం గంభీరంగా ఉండటం గమనించిన శేషయ్య, మృదువుగా నవ్వుతూ, "ఏరా, మనం వెళ్ళిన పని సానుకూల పడినట్టేనా?" అని ప్రశ్నించాడు.

దానికి జవాబుగా పరమేశం తల వంచు కుంటూ, "నువ్వు తలపెట్టిన పని బ్రహ్మాండంగా సానుకూలపడింది, మామయ్యా!" అన్నాడు.

శేషయ్య ఏమీ తెలియనట్టు నటిస్తూ ఆశ్చ ర్యంగా, "నేను తలపెట్టిన పనా, ఏమిట్రాఅది?" అని ప్రశ్నించాడు.

పరమేశం కాస్త తేలికపడుతూ నవ్వి, "నా గురించి నేను గొప్పగా చెప్పుకోవడం మాన్పించా లని, నన్ను పట్నం తీసుకొచ్చావు. గోవిందశెట్టి నీకు మిత్రుడైనా, ఆయన ఇల్లు కూడా ఎరగని వాడిలా వాళ్ళనూ, వీళ్ళనూ అడిగి, వాళ్ళు ఆయనను కీర్తించటం నాకు వినిపించావు. తర్వాత నిరాడంబరుడూ, తన గురించి తాను ఒక్కమాట కూడా చెప్పుకోని వాడూ అయిన శెట్టి దగ్గరకు తీసుకెళ్ళావు. సమయానికి అక్కడున్న పెద్దమనిషి వెటకారం నాకు గట్టిచురకే వేసింది. ఏమైతేనేం, నా కళ్ళు తెరిపించావు," అంటూ కృతజ్ఞతగా మేనమామ చేతులు పట్టుకున్నాడు.

శేషయ్య, మేనల్లుడి భుజాన్ని ఆదరంగా తడుతూ, "మనిషి విలువా, గొప్పతనమూ పెరిగేది, ఆ మనిషి చేతలవల్లనేగాని, మాటల వల్లకాదు. నువ్వుచేసేవి మంచి పనులైతే, నలుగురూ నీ మంచితనాన్ని గుర్తించి మెచ్చు కుంటారు. గొప్పవాడనిపించుకోవటం అంద రికీ సాధ్యపడదు. అలాంటివాళ్ళు నూటికీ కోటికీ ఒకరుంటారు. కానీ, మన ప్రవర్తన ద్వారా మంచివాడు, వివేకి అనిపించుకోవడం సులభ సాధ్యం," అన్నాడు.

మేనమామ మాటలు శ్రద్ధగా విన్న పరమేశం, తన ప్రవర్తనలోని అవివేకాన్ని గుర్తించాడు. ఆతర్వాత వాడు, తనను గురించి గొప్పలు చెప్పుకోవడంమాని, వినయగుణాన్ని అల వరుచుకుని, పదిమందిచేత మంచివాడని పించుకున్నాడు.





# చందమామ

# బంగారు గడియలు

## మృత్యు గహ్వరం

యువరాజు ఉదయనుడు భయానకమైన ఘోరీ తెగల వారికి పట్టుబడ్డాడు.

ఓ!! నేను చూడలేక పోతున్నాను

నా మంత్ర శక్తి నిన్ను గుడ్డివాణ్ణి చేసేంది! సూర్యాస్తమయంకల్లా మరణిస్తావు!!











# చందమామ గడియలు ప్రశ్నావళి

1. గత శతాబ్దంలో ఒకరోజు ఫ్రెంచి జంతు శాస్త్రజ్ఞుడు హెన్రీ మౌ హాట్ కంబోడియాలో సీతాకోకచిలుకలను పరిశీలిస్తూ వెళ్ళి, సువిశాల సామ్రాజ్యానికి రాజధానిగా వెలసిన ఒక మహానగర శిథిలాలను కనుగొన్నాడు. ఆ నగరం పేరేమిటి? అక్కడ బయటపడిన ఈ విగ్రహం పేరేమిటి?



2.



పోర్చుగీసులు ఈ పక్షిని చూసినప్పుడు ఇది వారికి చాలా వెకిలిగా కనిపించింది. అందుకే దానికి దోదో (వెర్రిమొహం) అని పేరు పెట్టారు. ఈ పక్షి ఏ ప్రాంతంలో ఉన్నది?

ఈ వరుసలో తరవాత ఏం వస్తుంది?

**M8ƧV**

4.

మహారాష్ట్ర గ్రామ ప్రాంతాలలో ప్రసిద్ధిగాంచిన జానపద నృత్యం ఇది. దీని పేరేమిటి?



5. ఈ అండమాను ఆటవికుడు దేనికి గురి పెడుతున్నాడు?



6.

పడవ నుంచి వేలాడుతున్న విగ్రహం నీళ్ళను తాకుతూ ఉన్నది. నదీ జలం పది నిమిషాలకు 10సెం.మీ. ప్రకారం పైకి ఉబుకుతున్నది. విగ్రహం ఎత్తు 1 మీ. ఒక గంట తరవాత విగ్రహంలో ఎన్నోవంతు నీటి లోపల ఉంటుంది?



# పాండాను కత్తిరించుకోండి!

ఈ బొమ్మను పెద్దది చేసి (జెరాక్స్ చేసుకోవచ్చు), చుక్కల గీతతో సహా ఒక గట్టి కాగితం మీద అతికించుకోండి.

ప్రపంచ ప్రకృతి నిధికి చిహ్నం-జెయింట్ పాండా.

బొమ్మను కత్తిరించి గీతల గుండా మడిచి నట్టయితే, ఇక్కడ చూపిన విధంగా కూర్చుని ఉన్న పాండాను తయారు చేసుకోవచ్చు.

మూడు సులభమైన అంచెలలో కుక్కపిల్ల బొమ్మ గీయండి.










ధర్మరాజు ద్రౌపదిని కూడా పోగొట్టుకున్నాడు. ఇక అతనికి పోగొట్టుకోదగినది ఏమీ మిగల లేదు.

దుర్యోధనుడు, "ద్రౌపదిని పిలిపించండి, ఆమె చేత ఈ సభ ఊడ్పించాలి," అని కేక పెట్టాడు.

విదురుడు కోపం పట్టలేక దుర్యోధనుడితో, "మూర్ఖుడా, ఒళ్ళు తెలీక నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నావు. పాండవులకు కోపం తెప్పించడం విషసర్పాలను రెచ్చగొట్టడమే. ద్రౌపది నీకెలా దాసి అయింది? ధర్మరాజు తన స్వాతంత్ర్యం పోగొట్టుకున్నాక ద్రౌపదిని పందెం పెట్టాడు," అని సభకేసి తిరిగి, "ఈ దుర్యోధనుడు మూఢుడు. నా మాట వినడు. కౌరవులకు త్వరలోనే నాశనం కలగబోతున్నది," అన్నాడు. దుర్యోధనుడు ఈ మాటలేవీ పట్టించుకోక ప్రాతికామి అనేవాణ్ణి పిలిచి, "నువ్వు వెంటనే అంతఃపురానికి పోయి ద్రౌపదిని తీసుకురా. ఈ పాండవులను చూసి నువ్వు ఏమాత్రం భయపడనక్కర లేదు," అన్నాడు.

దుర్యోధనుడి ఆజ్ఞ పొంది ప్రాతికామి పాండవుల బసలో ప్రవేశించి, "పాంచాలీ, నీ భర్త ధర్మరాజు జూదంలో నిన్ను పణంగా పెట్టి దుర్యోధనుడికి ఓడిపోయాడు. అందుచేత ఇప్పుడు నువ్వు దుర్యోధనుడి దాసీవి. నిన్ను ధృతరాష్ట్రుడి ఇంటికి రమ్మని ఆయనఆజ్ఞ," అన్నాడు.

"క్షత్రియుడెవడైనా జూదంలో భార్యను పణంగా పెడతాడా? ధర్మరాజుకు మతి



పోయిందా ఏమిటి? జరిగినదేమిటో సరిగా చెప్పు," అన్నది ద్రౌపది.

"ధర్మరాజు తనకున్నదంతా జూదంలో పోగొట్టుకుని, పందెం కాయడానికి ఇంకేమీ లేకపోగా, తన తమ్ములను ఒడ్డి, ఓడిపోయి, చివరకు తననూ, నిన్నూ కూడా పణం పెట్టి అంతా పోగొట్టుకున్నాడు," అని చెప్పాడు ప్రాతికామి.

"ఒరే, నువ్వు సభకు తిరిగిపోయి, ఆయన ముందు తననుఓడి నన్నోడాడో, లేక ముందు నన్ను ఓడి తరవాత తనను ఓడాడో తెలుసు కునిరా!" అన్నది ద్రౌపది.

ప్రాతికామి జూదమాడిన చోటికి తిరిగి వచ్చి, ద్రౌపది సందేహాన్ని ధర్మరాజుతో చెప్పాడు. ఈ ప్రశ్నను విని, ధర్మరాజుకు పుట్టెడు దుఃఖం ముంచుకువచ్చి, ఏమీ చెప్పలేకపోయాడు.

దుర్యోధనుడు ప్రాతికామితో, "ఆమెను ముందు సభకు వచ్చి, తన సంశయాన్ని తానే తీర్చుకోమని చెప్పు. వెళ్ళు," అన్నాడు.

ప్రాతికామి మళ్ళీ ద్రౌపది వద్దకు పోయి, "అమ్మా, నిన్ను స్వయంగా వచ్చి నీ అను మానం తీర్చుకోమని సభవారంటున్నారు," అని చెప్పాడు.

"ప్రాతికామీ, నేను ఆ సభకు రావటం చాలా తప్పు. అది కౌరవుల కీర్తికి పెద్ద కళంకం. నా ప్రశ్నకు సభలోని వారిని సమాధానం చెప్పమను. అటుతరవాత వారు ఏం చెయ్యమంటే అది చేస్తాను," అన్నది ద్రౌపది.

ప్రాతికామి ఆమె అన్న మాటలు సభకు తెలిపాడు. సభలోని వారు దుర్యోధనుడికి విరుద్ధంగా ఏమీ చెప్పలేక తలలు వంచి మౌనంగా ఉండిపోయారు. ఇది గ్రహించి ధర్మరాజు ద్రౌపదిని పిలుచుకురావటానికి ప్రాతికామి వెంట ఒక దూతను పంపాడు. ఆ దూత ధర్మరాజు పిలుస్తున్నాడని చెప్పిన మీదట, ద్రౌపది ఏకవస్త్ర అయివుండి కూడా ప్రాతికామి వెంట సభకు వెళ్ళి, ధృతరాష్ట్రుడికి ఎదురుగా దూరంగా నిలబడింది. పాండవులు ఎటు చూడటానికీ మొహాలు చెల్లక తలలు వంచుకుని దీనంగా, విషాదంగా కూర్చున్నారు.

వారి మనస్థితి గమనించి దుర్యోధనుడు మరింతగా విజృంభించి, ప్రాతికామితో, "చూస్తావేం, ఆమెను ఇక్కడికి తీసుకురారా!" అన్నాడు.

ప్రాతికామికి ద్రౌపదిని అంటుకోవడానికి భయం వేసింది. అతను సభలో ఉన్నవారిని ఉద్దేశించి, "ద్రౌపదితో ఏమి చెప్పమన్నారు?" అని అడిగాడు.

వాడు భీముణ్ణి చూసి భయపడుతున్నాడని గ్రహించి, దుర్యోధనుడు దుశ్శాసనుడితో, "దుశ్శాసనా, దాన్ని ఇలా ఈడ్చుకురా. మనకు దాసులైన ఈ శత్రువులు ఏమీ చేయలేరు," అన్నాడు.

దుశ్శాసనుడు మానాభిమానాలు వదిలేసి, "ద్రౌపదీ, ఇలారా. నీ.భర్తలు నిన్ను మాకు ఓడారు. సిగ్గెందుకు? మా దుర్యోధనుణ్ణి ప్రేమించు. కౌరవులను వరించు," అంటూ ద్రౌపదిని సమీపించాడు. ద్రౌపది వెలవెల పోతూ ముఖాన్ని చేతులతో కప్పుకుని, గాంధారికేసి వెళ్ళసాగింది.

దుశ్శాసనుడు ఆమెను వెంబడించి, "ఇంకెక్కడికి పోతావు?" అంటూ ద్రౌపది జుట్టు పట్టుకుని లాగాడు. అయిదుగురు మహావీరులు భర్తలై కూడా అనాథ అయిపోయిన ద్రౌపది గడగడా వణికిపోతూ, హీన స్వరంతో, 'ఓరీ, బుద్ధిహీనుడా! నేనిప్పుడు ఋతువులో ఉన్నాను. నన్ను సభ మధ్యకు తీసుకుపోరాదు," అన్నది.

దానికి దుశ్శాసనుడు, "నువ్వు ఏకవస్త్ర వైతేనేం? మరెలావుంటేనాకేం? నీ మొగుడు





ఆపడం భీష్మద్రోణులకూ, విదుర ధృతరాష్ట్రులకు కూడా సాధ్యం కాదు లాగుంది!" అని పాండవుల కేసి చురచురా చూసింది.

దుశ్శాసనుడు, "ఓసి దాసీ!" అన్నాడు. ఆ హాస్యానికి కర్ణుడూ, శకునీ, దుర్యోధనుడూ విరగబడి నవ్వారు. మిగిలినవాళ్ళు లోలోపల దుఃఖపడ్డారు.

అప్పుడు భీష్ముడు ద్రౌపదితో, "అమ్మా, ధర్మసూక్ష్మం చెప్పటానికి లేదు. అయిదుగురికి భార్యవైన నిన్ను ధర్మరాజు పందెం పెట్టడం తప్పే. కానీ ధర్మరాజు తన సర్వస్వమూ వదులుకుంటాడు గాని, ధర్మం వదలడు. ఆయన జూదంలో నిన్ను ఓడి నీకు మోసం చేస్తాడా?" అన్నాడు.

ఈ మాటకు ద్రౌపది, "ధర్మరాజు తనకిష్టం లేని జూదంలో దిగి, మోసానికి గురి అయి, అంతా పోగొట్టుకుని, ఇంకేమీ లేక, నన్ను పందెం పెట్టాడా? కొడుకులకూ, కోడళ్ళకూ నియమానుసారంగా భరణాలిచ్చే కౌరవ పెద్దలు నాకు తెలియజెప్పాలి," అంటూ ఏడ్చింది. దుశ్శాసనుడు అవాచ్యాలు పలికాడు.

ఆ మాటలు విని భీముడు ధర్మరాజుతో, "జూదగాళ్ళు నీతిలేని భార్యలను సైతం పణం పెట్టరు. పరమ పవిత్రురాలైన ద్రౌపదిని నువ్వు పణంగా పెట్టడం మహా అన్యాయం. సమస్త ఐశ్వర్యాలనూ,మమ్మల్నీ ఓడితే ఓడావు. పాంచాలిని పణంగా పెట్టిన నీ చేతులు కాల్చాలి. సహదేవా. నిప్పుపట్టుకురా!"అన్నాడు.

జూదంలో నిన్ను మాకు ఓడాడు. నువ్వు మా దాసివి. ఇవాళనుంచీ మా ఇతర దాసీలతోబాటే నువ్వూనూ!" అంటూ ద్రౌపదిని జుట్టుపట్టుకుని సభామధ్యానికి బరబరా ఈడ్చుకు వచ్చాడు.

ద్రౌపది జుట్టు ఊడిపోయింది. చీర సగం జారిపోయింది. సిగ్గూ, కోపమూ ఆమెను దహించాయి. ఆమె దుశ్శాసనుడితో, "దుర్మార్గుడా, తండ్రుల లాంటి ఈ అందరిముందూ నేనిలా నిలవరాదు. నన్ను అవమానకరమైన స్థితిలో పెట్టకు. ఈ పాపిష్ఠి పనికి నీవు అనుభవిస్తావు. ఈ సభలో అందరూ ధర్మం తెలిసిన వారే. కానీ, ఒక్కరూ నిన్ను ఇదేమనరు. భరతకులం పుచ్చిపోయింది. ఈ అన్యాయాన్ని

అది విని అర్జునుడు భీముడితో, "ఇంత సేపు ఓర్చుకున్నవాడివి ఇప్పుడు అన్న మనసు నెందుకు బాధిస్తావు? ఈ జూదగాళ్ళ మూలాన నీ ధర్మబుద్ధి కూడా చెడిపోయిందా ఏం? ధర్మరాజు తానై జూదం ఆడలేదు. ఇతరులు పిలిస్తే రాజధర్మం పాటించి ఆడాడు. ధర్మరాజు చేసిన తప్పేమీ లేదు. శాంతించు," అన్నాడు.

ద్రౌపది అడిగినదానికి సభలో ఎవరూ జవాబు చెప్పకపోవడం చూసి, ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడైన వికర్ణుడు, "ద్రౌపది అడిగిన దానికి జవాబు చెప్పండి. కురువృద్ధులూ, గురువులూ మాట్లాడరేం? పక్షపాతం లేకుండా, రాగ ద్వేషాలు లేకుండా ధర్మం చెప్పండి," అని చాలాసార్లు గట్టిగా అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అతను ఇంకా ఇలా అన్నాడు:

"మీరు న్యాయం చెప్పకపోతే, నేను చెబుతాను, వినండి. ఆడదీ, వేటా, జూదమూ, తాగుడూ – ఈ నాలుగింటికీ దాసుడైన రాజు ధర్మానికి నిలబడలేదు. ధర్మరాజు జూదమనే వ్యసనం మూలంగా తన సమస్తాన్నీ, తమ్ములనూ, తననూ ఓడి, చివరకు ద్రౌపదిని ఓడాడు. ద్రౌపది పాండవులందరిదీ కాని ధర్మరాజు సొంత సొత్తు కాదు. ఈమెను ఈ సభలోనికి తీసుకురావడం అన్యాయం. ఇది నా ధర్మనిర్ణయం," అన్నాడు.

వికర్ణుడికి కర్ణుడు అడ్డు వచ్చి, "ఈ సభలో పెద్దలెవరికీ తెలీని ధర్మం, కుర్రవాడివి నీకు తెలిసిందా? ధర్మరాజు తన సర్వస్వాన్నీ





శ్యంగా వచ్చి అక్కడ నిలబడి, ద్రౌపదికి అనేక చీరలు ఇస్తూ పోయాడు.

దుశ్శాసనుడు ఎన్ని చీరలు లాగేసినప్పటికీ, ద్రౌపది వంటిన చీర ఉంటూనే వచ్చింది. ఒక వంక దుశ్శాసనుడు వలిచిన చీరల గుట్ట చిన్న కొండలాగా తయారయింది. దుశ్శాసనుడు విసిగిపోయి ఇక చీరలు లాగలేక ఊరుకున్నాడు.

భీముడు పట్టరాని కోపంతో, కింది పెదవి కొరికి, నేలను చేత్తో చరిచి, "అందరూ వినండి! ద్రౌపదికి మానభంగం కలిగించ డానికి ప్రయత్నించిన ఈ దుశ్శాసనుణ్ణి యుద్ధంలో చంపి, వాడి రొమ్ము చీల్చి, వాడి రక్తం తాగుతాను! ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు.

ఓడినప్పుడే ద్రౌపదినీ ఓడాడు. అందుకే పాండవులు మాట్లాడరు. ఈ ద్రౌపదిని ఈ సభకు తీసుకురావడం అన్యాయం అన్నావు. అయిదుగురు భర్తలు కలది కులట. అలాటి దాన్ని నిండుసభలో బట్టలు వలిచినా తప్పు లేదు. దుశ్శాసనా, వికర్ణుడు వదరడాని కేంలే? నువ్వు ఆపాండవుల బట్టలూ, ద్రౌపది బట్టలూ వలిచి పట్టుకురా," అన్నాడు. ఆవేశంగా.

కర్ణుడిలా అనగానే పాండవులు తమ పై బట్టలు తీసి దూరంగా పెట్టారు.

దుశ్శాసనుడు ద్రౌపది చీర విప్పనారం భించాడు. అప్పుడు ద్రౌపది తనను రక్షిం చమని కృష్ణుణ్ణి ప్రార్థించింది. కృష్ణుడుఅదృ

ఇంత జరిగాక విదురుడు లేచి, చేతులు పైకెత్తి, "సభికులారా, ద్రౌపది ప్రశ్నకు సమా ధానం చెప్పకపోతే అధర్మంఅవుతుంది. ఇంత మంది ఉన్నా వికర్ణుడొక్కడే తన అభిప్రాయం చెప్పాడు. దీనులకు ధర్మం చెప్పకపోతే అసత్య దోషంలో సగం మిమ్ముల నందరినీ అంటు కుంటుంది," అన్నాడు.

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. దుర్యో ధనుడు ద్రౌపదికి సైగ చేసి తనతొడచూపాడు. భీముడిది చూసి మరింత మండిపడి, యుద్ధంలో దుర్యోధనుడి తొడలు గదతోవిర గగొడతానని ఘోరప్రతిజ్ఞ చేశాడు.

అతను మండుతున్న అగ్నిజ్వాలలాగా కనిపించాడు.

దుర్యోధనుడు ద్రౌపదితో, "నావల్ల ఏతప్పూ లేదు. భీమార్జున నకుల సహదేవులు తమకు ధర్మరాజు ప్రభువు కాదని చెప్పితే నీకు దాస్యం ఉండదు," అన్నాడు.

అప్పుడు అర్జునుడు, "ధర్మరాజు మా కందరికీ ప్రభువన్నది నిజమే. కాని ఆయన తానే ఓడిపోయాక ఎవరికి ప్రభువో కౌరవులు చెప్పాలి," అన్నాడు.

ఆ సమయంలో అనేక ఉత్పాతాలు కలిగాయి. అది చూసి భయపడి ధృతరాష్ట్రుడు, "ఒరే దుర్యోధనా! దుర్మార్గుడా! ద్రౌపదిని సభకెందుకు బలవంతంగా తెచ్చావురా? పాండవుల మీద నీకీ పగ దేనికి? ఏమిటీ అన్యాయం?" అని కొడుకును మందలించి, ద్రౌపదిని దగ్గరకు పిలిచి, "అమ్మా, నా కోడళ్ళలో నువ్వే చాలా ఉత్తమురాలివి. నీకేమి కావాలో కోరుకో తల్లీ!" అన్నాడు ఎంతో ఆప్యాయంగా.

ద్రౌపది పాండవులకు వెంటనే దాస్య విముక్తి, వారి ఆయుధాలు వారికి తిరిగిఇవ్వ టమూ కోరింది.

"ఆహా, ఈనాటికి పాండవులను ఒక ఆడది ఉద్ధరించింది!" అని కర్ణుడు వెటకారం చేశాడు.

భీముడు రౌద్రాకారం ధరించి, శత్రువుల నందరినీ ఆ క్షణమే నిర్మూలిస్తాననిముందుకు ఉరికాడు.

అతికష్టం మీద అర్జునుడూ, ధర్మరాజూ అతనిని శాంతింపజేశారు.

తర్వాత ధర్మరాజు ధృతరాష్ట్రుణ్ణి, "రాజా, మాకేమి ఆజ్ఞ?" అని అడిగాడు.

"నాయనా, నువ్వూ, నీ తమ్ములూ ఇంద్ర ప్రస్థానికి వెళ్ళి హాయిగా రాజ్యం ఏలుకోండి. స్నేహపూర్వకంగా జూదం ఆడదామంటే సరే నన్నాను. ఆపకపోవటం నాది పొరపాటే. ముసలి వాళ్ళమైన నన్నూ, గాంధారినీ చూసి నా కొడుకులు చేసిన దుష్కార్యాలను మరిచి పొండి. నీకూ, నీ తమ్ములకూ శుభం కలుగు గాక!" అన్నాడు ధృతరాష్ట్రుడు.

పాండవులు పెద్దలందరి వద్దా సెలవు తీసుకుని ద్రౌపదితో సహా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్ళిపోయారు.



చందమామ
అనుబంధం - 92

మనదేశపు చెట్లు :

# వెలగచెట్టు

వెలగకాయలంటే ఏనుగులకు చాలా ఇష్టం. అంతే కాదు. ఏనుగులు వెలగకాయలను అలాగే నోట్లో వేసుకుని మింగేస్తాయి. అయితే, అది కడుపులో వెలగకాయ లోపలి గుజ్జును మాత్రం లాగేసి పెంకును విసర్జి స్తాయి! అందుకే దీనిని లాటిన్ భాషలో 'ఫెరోనియా ఎలిఫాంటమ్' అని అంటారు. వినాయక చవితిరోజున వెలగకాయలను విఘ్నేశ్వరుడికి నైవేద్యం పెట్టడం తెలిసిన విషయమే. పై పెంకు గట్టి గాను, లోపల పండిన గుజ్జు తియ్యగానూ ఉండడం వల్ల దీనిని ఇంగ్లీషులో 'వుడ్ ఆపిల్' అని అంటారు. వెలగపండు లోపలి గుజ్జు చలవ చేస్తుంది. అందువల్ల వేసవికాలంలో దీనితో షర్బత్ తయారు చేస్తారు. ఈ షర్బత్‌లో చక్కెరకు బదులు బెల్లం కలుపుతారు. వెలగపండు గుజ్జు, తేనె, కలకండ కలిపి రుచికరమైన తినుబండారం కూడా తయారు చేస్తారు.

వెలగను సంస్కృతంలో కపిత్థ అనీ హిందీ లో కవితాహి లేదా కావాత్ అనీ, గుజరాతీలో కోథా అనీ, మరాఠీలో కవాత్ అనీ, బెంగాలీ లో కథ్‌బేల్ అనీ, కన్నడంలో బేలా అనీ, తమిళంలో విలాంబళం అనీ అంటా రు.

వెలగచెట్లు అడవిప్రాంతాలలో ఎక్కువ గా పెరుగుతాయి. కానీ కొన్ని చోట్ల ఇళ్ళ ఆవరణలో పెరట్లో కూడా కనిపిస్తాయి. దృఢమైన పాడవాటి కొమ్మలతో చెట్లు సాధా రణమైన ఎత్తు పెరుగుతాయి. రెమ్మలు చిలవలు పలవులుగా ఉంటాయి. ఈనెలకు రెండువైపులా ఆకులు ఉంటాయి. లేత ఎరుపు రంగులో చిన్నపువ్వులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. కాయలు లేత ఊదా రంగులో పై పెంకు గరుకుగా రెండున్నర అంగుళాల అడ్డు కొలతలో బంతుల్లాగా ఉంటాయి.



మనదేశపు ఋషులు:

# కశ్యపుడు - ఆస్తీకుడు

ఒకానొకప్పుడు భూమి మీద సర్పభయం ఎక్కువగా ఉండేది. అప్పటి ప్రజలు పంటలకని నమ్ముకున్న పొలాలలోనూ, నదీ జలాలలోనూ, తటాకాలలోనూ పాములు ఎక్కువయ్యాయి. ఇక అడవుల సంగతి సరేసరి. అందువల్ల భూమి మీద మానవజాతి ఉనికికే అపద వాటిల్లింది!

ఆ అపదను గుర్తించిన కశ్యపుడనే ఋషి ధ్యాన నిమగ్నుడై వుండి, దైవబలంతో కొన్ని మంత్రాలను రచించాడు. ఆ మంత్రాల మహిమతో పాములబెడద తగ్గించాడు. పాము కాటును నయం చేసే విషవైద్యం కనుగొన్నాడు. అన్నిటి కన్నా మించి తన తపోబలంతో సర్పాలను అదుపు చేసే మానసాదేవి అనే దేవతను సృష్టించాడు.

మానసాదేవి, జరత్కారుడనే మరొక ఋషిని వివాహమాడింది. వారికి ఆస్తీకుడనే కుమారుడు కలిగాడు. అతడు బాల్యం నుంచే విష్ణుభక్తి తత్ప రుడుగా పేరుగాంచాడు.

పరీక్షిత్తు రాజు ఒకనాడు వేటకు వెళ్ళి, అడవిలో కళ్ళు మూసుకుని తపస్సు చేసుకుంటూన్న సమీకుడనే ముని మెడకు, ఉత్సాహం కొద్దీ చచ్చిన పామును చుట్టి వచ్చాడు. ఆ చర్యకు ఆగ్రహం చెందిన సమీకముని కుమారుడు – ఆ దుష్కార్యానికి పాల్పడిన రాజు ఏడవరోజులోగా పాముకాటుతో మరణిస్తాడని శపించాడు. విషయం గ్రహించిన రాజు ఎటువంటి పామూ తన దరిదాపులకు రాకుండా కట్టుదిట్టమైన జాగ్రత్తలు తీసుకున్నాడు. కాని ఏడవరోజు సూర్యాస్తమయ సమయంలో రాజు తినడానికి ఒక పండును కోశాడు. ఆ పండులోపల పురుగు రూపంలో ఉన్న పాము క్షణంలో పెద్దదై పరీక్షిత్తును కాటేసింది. ముని కుమారుడి శాపం ఫలించింది. ఆ పాము తక్షకుడనే సర్పరాజు!

తక్షకుడి చర్యకు ఆగ్రహం చెందిన పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు ప్రపంచంలో పాములే లేకుండా సర్పనాశనం చేయాలని ప్రతిన బూనాడు. ఋషులను సంప్రదించాడు. వారి సలహా ప్రకారం సర్పయాగం ప్రారంభించాడు. ఋషుల నుంచి వెలువడిన శక్తివంతమైన మంత్రాల మహిమ కారణంగా ఎక్కడెక్కడి నుంచో వేలాది పాములు వచ్చి యజ్ఞగుండంలో పడి అగ్నిజ్వాలలకు ఆహుతయ్యాయి.

దానిని చూసి భయపడిపోయి తక్షకుడు దేవేంద్రుడి సింహాసనం కింద దాక్కున్నాడు. ఋషుల మంత్ర మహిమకు దేవేంద్రుడి సింహాసనం, దేవేంద్రుడితో సహా యజ్ఞగుండం కేసి రాసాగింది. తక్షకుడు ఆ సింహాసనాన్ని చుట్టుకున్నాడు!

ఆ సమయంలో ఆస్తీకుడు జనమేజయ మహారాజును సందర్శించి, తన విద్యా వివేకాలతో ఆయనను మెప్పించి, సర్పయాగం ఆపే విధంగా చేశాడు. తక్షకుడు ప్రాణాలతో పారిపోయాడు. మరి కొన్ని పాములు కూడా తప్పించుకున్నాయి.

ఆస్తీకుడు సర్పజాతి నశించిపోకుండా కాపా డినవాడు కాబట్టి, భక్తితో ఆయనపేరును తలుచుకున్న వారికి సర్పభయం ఉండదని చెబుతారు!



# మీకు తెలుసా?

1. దయ్యాల దీవి (డెవిల్స్ ఐలాండ్) ఎక్కడ ఉన్నది?
2. భారత రైల్వేమార్గం మొత్తం పొడవు ఎంత?
3. ఇటీవల కేరళరాష్ట్ర ఎన్నికలు జరిగాయి కదా, అక్కడి అసెంబ్లీ స్థానాలు ఎన్నో తెలుసా?
4. మనదేశంలో ఇంగ్లీషును అధికారభాషగా స్వీకరించిన రాష్ట్రం ఏది?
5. సుప్రసిద్ధ పక్షిశాస్త్రజ్ఞుడు సలీం అలీ స్వీయచరిత్రతో సంబంధం కలిగిన పక్షి ఏది?
6. గణిత శాస్త్రంలో 'లాగారిథమ్సును' రూపొందించిన వారెవరు?
7. మనదేశంలో అనిమేషన్ సినిమాలు తీయడానికని ప్రత్యేకంగా స్టూడియో స్థాపించిన వారెవరు? అది ఎక్కడ ఉన్నది? ఆ స్టూడియోలో తీసిన మొట్టమొదటి సినిమా ఏది?
8. ఐక్యరాజ్యసమితి స్వర్ణోత్సవాలు గత సంవత్సరం జరిగాయి. ఆ సందర్భంగా అక్కడ మొట్టమొదటిసారిగా మలయాళంలో ఉపన్యసించడానికి మనదేశం నుంచి ఆహ్వానించబడిన వారెవరు?
9. ఐక్యరాజ్యసమితిలో ఆఖరుగా చేరిన దేశం ఏది?
10. మనదేశం నుంచి వెళ్ళి ఐక్యరాజ్యసమితిలో సంగీత కచేరీ జరిపిన ఏకైక గాయని ఎవరు?
11. ఐక్యరాజ్యసమితి అధికారభాషలు ఏవి?
12. మొట్టమొదటి భారత జాతీయ రహదారి ద్వారా కలుపబడిన రెండు నగరాలు ఏవి?
13. ప్రపంచ వ్యాపార సంస్థ డైరెక్టర్ జనరల్ ఎవరు?
14. వరల్డ్ కప్ క్రికెట్‌లో అతితక్కువ పరుగులు తీసిన దేశంగా పాకిస్తాన్‌కు పేరున్నది. స్కోరు ఎంత? అప్పుడు ఏ దేశంతో ఆడింది?
15. వచ్చే వరల్డ్ కప్పు పోటీలు ఎక్కడ జరుగుతాయి?

## సమాధానాలు

1. దక్షిణ అమెరికాకు ఈశాన్యంగా ఫ్రెంచి గయానా ఉన్నది. దానికి సమీపంలో ఉన్న ఒక దీవిని డెవిల్స్ ఐలాండ్ అని అంటారు.
2. 62,000 కి.మీ.
3. 140.
4. నాగాల్యాండ్.
5. పిచ్చుక.
6. జాన్ నేపియర్
7. దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు గ్రహీత. డా.అక్కినేని నాగేశ్వరరావు. హైదరాబాదులో హార్ట్ ఎంటర్‌టైన్‌మెంట్.
8. మాతా అమృతానందమయి.
9. పాలావ్ రిపబ్లిక్.
10. ఎం. ఎస్. సుబ్బులక్ష్మి.
11. అరబిక్, చైనీస్, ఇంగ్లీష్, ఫ్రెంచ్, రష్యన్, స్పానిష్.
12. ఢిల్లీ - చండీఘుర్.
13. రినెటో రుగిరో.
14. 40.2 ఓవర్లలో 74 పరుగులు. 1992లో ఇంగ్లాండుతో ఆడినప్పుడు.
15. ఇంగ్లాండు.

# బంగారు గడియలు ప్రశ్నావళి నెం:1 సమాధానాలు.



1. స్క్వాడ్రన్ లీడర్ రాకేష్‌శర్మ. సోవియట్ వ్యోమనౌక సోయుజ్ టిలో, మరిద్దరు సోవియట్‌వ్యోమగాములతో 1984, ఏప్రిల్ 5న అంతరిక్ష యాత్ర చేశాడు.

2. సవాయ్ రాజా జయ్‌సింగ్ జయ్‌పూర్‌లో నిర్మించిన ప్రపంచంలోకెల్లా అతి పెద్దదయిన సూర్య గడియారాన్ని బృహత్ సామ్రాట్ యంత్రం అని పిలిచేవారు.

3. కుజ, గురు గ్రహాల మధ్య సెరెస్ అనే చిన్న ఉపగ్రహం (ఆస్టెరాయిడ్) కనిపిస్తుంది. మనకు తెలిసిన అతి పెద్ద ఆస్టెరాయిడ్ ఇది. దీనిని 1801 జనవరి 1వ తేదీ కనుగొన్నారు.

4. పూరీలోని జగన్నాథ ఆలయం. శ్రీ కృష్ణుడు గోకులం నుంచి మధురకు వచ్చిన దానికి గుర్తుగా ఇక్కడ యేటా జరిగే ఉత్సవాల సమయంలో ఈ విగ్రహాలను బ్రహ్మాండమైన రథాలపై ఉంచి వేలాది మంది భక్తులు లాగుతారు.

5. ఫిబ్రవరి 28. రోజుకు నికరం 1మీ. ప్రకారం 27 రోజులలో 27 మీ॥ దాటుతుంది. 28వ రోజు పైకి చేరుకుంటుంది.

∃4 + 4| = |

↓

∃4 = 4| –┐

7. ఎ. మహారాష్ట్ర
   బి. గోండ్‌వన (మ.ప్ర)
   సి. కూర్గు (కర్నాటక)
   డి. నాగాల్యాండ్.

**చంద్రుడి మీది రహస్యం**

వ్యోమగామి, అతని వెనుక భీకరమృగం చేసిన శబ్దం విని ఉండడు. ఎందుకంటే – చంద్రుడి మీద శబ్దం వినిపించే వాతావరణం లేదు.





# వంటదయ్యం

కూనవరం గ్రామంలో ఉండే నాగరాజు, కూతురు సువర్చల పెళ్ళి కోసం, తనకున్న రెండెకరాల పొలం యాభైవేలకుఅమ్మివేశాడు.

సువర్చలకు, తండ్రి చేసిన ఈ పని ఇష్టం లేదు. ఆమె అతడితో, "నాన్నా, ఈ డబ్బులో సగం ఖర్చు చేసి ఒక ఇల్లు కొను. లేకపోతే నా పెళ్ళి అయ్యాక నీకు నిలవనీడ కూడా ఉండదు. పొలం ఆదాయం పోయాక నెలనెలా అద్దెలు కట్టడం కష్టం. నా పెళ్ళి కోసం అని నువ్వు ఉన్నదంతా ఊడ్చిపెట్టడం నాకేమాత్రం ఇష్టం లేదు," అన్నది.

ఆమె పట్టుదల వల్ల ఇల్లు కొనక తప్పలేదు, సువర్చల తండ్రికి. ఆ ఇల్లు ఆనందుడనే వాడిది. చిన్నతనంలో తండ్రి పోయిన ఆనందుడిని, తల్లి అష్టకష్టాలు పడి పెంచి పెద్ద చేసింది. ఆనందుడు బాధ్యతలు పట్టించుకోకుండా తిరుగుతూండేవాడు. తల్లి మరణంతో వాడికి డబ్బు సంపాయించడానికి ఎంత కష్టపడాలో తెలిసివచ్చింది. ఉద్యోగం ఏదీ దొరకక వాడు తాతల నాటి ఇల్లుఅమ్మి, ఆ డబ్బుతో వ్యాపారం ప్రారంభించే ఆలోచనలో ఉన్నాడు. ఆ సమయంలో సువర్చల తండ్రి నాగరాజు, పాతికవేలకు వాడి ఇల్లు కొన్నాడు.

వారం రోజుల తరవాత సామానును రెండు ఎడ్లబండ్లలో సర్ది, అద్దెఇంటినుంచి సొంతఇంటికి మారారు సువర్చలా, ఆమె తండ్రీ. ఇల్లంతా సర్దుకునేసరికి బాగా పొద్దుపోయింది.

వంట చేసే ఓపికలేని సువర్చల విధి లేక పొయ్యి రాజేస్తూ, "ఈ పూటకు ఏపుణ్యాత్మురాలో వచ్చి వంట చేసి పెడితే ఎంత బావుండును!" అనుకున్నది.

ఆ మరుక్షణం, "ఈ ఒక్కపూటకేం ఖర్మ! ఇకనుంచి ఈ ఇంట్లో రెండు పూటలా నేనే వంట చేస్తాను?" అంటూ చేతిలో ఒక పెద్ద

మాచిరాజు కామేశ్వరరావు



గరిటతో ఒక ఆడదయ్యం గదిలో ప్రత్యక్ష మయింది.

దయ్యాన్నిచూస్తూనే కెవ్వుమన్నది సువర్చల. దయ్యం సువర్చలకు అభయమిస్తున్నట్లు కుడిచేతిలో వున్న గరిటెను గాలిలో తిప్పుతూ, "భయపడకు! నేను ఎవర్నో కాదు. స్వయానా నీకీ ఇల్లమ్మిన ఆనందుడి తల్లిని. వాడిప్పుడు ఇల్లమ్మగా వచ్చిన పాతికవేల రూపాయలతో ఏదో వ్యాపారం ప్రారంభిస్తున్నాడు. బుద్ధి కుదరాలే గాని – వాణ్ణి మించిన బుద్ధిశాలి ఈ చుట్టుపక్కల గ్రామాల్లో కూడా ఎవడూ లేడు. ఇక నా సంగతంటావా? బతికుండగా, బతుకుతెరువుకు నాలుగైదిళ్ళలో వంట చేసే దానిని. ఇప్పుడు కనీసం ఒక ఇంట్లో– అదీ నా ఇంట్లో వంట చేయకపోతే మహచెడ్డచిరాకుగా ఉంటుంది," అన్నది.

సువర్చల వణికిపోతూ ముందుగదిలో ఉన్న తండ్రికి జరిగినదంతా చెప్పింది. ఇది విని నాగరాజు హడలిపోయి, "మన ఖర్మకొద్దీ కొనక కొనక ఈ దయ్యాల కొంప కొన్నామన్న మాట!" అంటూ తలకొట్టుకున్నాడు.

సువర్చల, తండ్రికి సర్దిచెపుతూ, "నాన్నా, నువ్వు దిగులుపడకు. చూడబోతే ఈ వంట దయ్యం మంచీ, మర్యాదా ఎరిగినదానిలా ఉంది," అన్నది.

నాగరాజు ఏదో అనబోయేంతలో, వంట గదిలోంచి దయ్యం, "భోజనం సిద్ధం! తండ్రీ కూతుళ్ళు రావచ్చు," అంటూ గరిటెతోకంచం మీద కొడుతూ కేక పెట్టింది. నాగరాజూ సువర్చలా బిక్కుబిక్కుమంటూ వంటగదిలోకి వెళ్ళారు. భోజనం అద్భుతంగా వుంది. ఆ మాట దయ్యానికి చెప్పడం మంచిదా, కాదా అని సంశయిస్తున్నంతలో దయ్యం, "రేపు ఉదయంనుంచీ చీకటితోనే వచ్చి, వంట చేసి వెళతాను," అని చెప్పి మాయమయ్యింది.

ఈ విధంగా వంటపని తప్పడంతో సువర్చలకు, కొంత వీలు చిక్కింది. అయితే, వారం గడిచేసరికి దయ్యం వంట పట్ల ఆమెకు విసుగు పుట్టింది. దయ్యం ఒకే రకం వంటలు చేసేది. నూనె ఎక్కువ వాడేది. అది చీకటితో చేసిన వంట మధ్యాహ్నానికి చల్లారిపోయి బావుండేది కాదు. ఊరు

మాటుమణిగాక వచ్చి దయ్యం రాత్రి వంట చేసేది. భోజనాలు ముగించేసరికి అర్ధరాత్ర య్యేది. అంతసేపు నిద్రకు ఆగడం కష్టంగా ఉండేది, నాగరాజుకు.

ఒకనాటి ఉదయం చీకటివేళ దయ్యం రాగానే, సువర్చల దానితో, "నా వంట నేను చేసుకోగలను. నీ కొడుకు ఆనందుడి ఇంట్లో వండిపెట్టేవాళ్ళు లేక చాలా ఇబ్బంది పడు తున్నాడట. ఈ వంట ఏదో అక్కడ చేయ కూడదా," అన్నది.

"కూడనే కూడదు. నేను దయ్యమయ్యా నని తెలిస్తే, వాడు చాలా బాధపడతాడు. వాడు రెండుచేతులా బాగా ఆర్జిస్తున్నాడు. కావాలంటే ఒకళ్ళని కాదు, ఇద్దరు నల భీములంటివాళ్ళను వంటకు కుదుర్చుకో గలడు!" అన్నది దయ్యం.

సువర్చల మనస్సులో, ఇదేదో మొండి దయ్యం అనుకుని, సంశయిస్తూనే, "నీ వంట మాకు నచ్చడం లేదు," అన్నది.

ఆ మాట వింటూనే దయ్యం, "ఔరౌరా! నా వంటనే తప్పు పట్టడమా? నేనసలే మంచిదాన్ని కాను. తండ్రీ కూతుళ్ళిద్దరూ నేను చేసినదేదో నోరు మూసుకుని మరీ తినండి," అంటూ బెదిరించింది.

ఆ రోజునుంచీ కోపం కొద్దీ దయ్యం, కూరల్లో మరింత కారం, మరింత నూనె - వేస్తూ పదిహేనురోజుల్లోనే నెలకు సరిపడా వెచ్చాలు ఖర్చు చేయడం మొదలుపెట్టింది.



విధిలేక నెల మధ్యలో మళ్ళీ వెచ్చాలు కొని తెచ్చేవాడు నాగరాజు.

ఇలా ఉండగా - ఒకనాటి రాత్రి బాగా పొద్దుపోయాక తండ్రీ కూతుళ్ళు భోజనం చేస్తూ ఉండగా,సువర్చల చిన్ననాటి స్నేహితు రాలు పట్నంనుంచి పొరుగుగ్రామంలో బంధువులఇంట జరుగుతున్న పెళ్ళికి వెళ్ళి సువర్చలను చూసి పోదామని వచ్చింది.

ఆమె, తండ్రీకూతుళ్ళు అంత రాత్రివేళ భోజనాలు చేస్తూండడం చూసి, "ఈ వేళప్పుడు భోజనాలేమిటి?" అని అడిగింది.

"గుడిలో హరికథ విని ఇప్పుడే వచ్చాం. సరే, బావున్నావు కదా?" అంటూ కుశలప్రశ్నలు వేసింది సువర్చల.



తరవాత నడవా గదిలో మంచాలు వేసు కుని స్నేహితురాళ్ళిద్దరూ కొంతసేపు ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పుకున్నాక సువర్చల తాముఇల్లుకొన్ననాటినుంచీ వంటదయ్యం వల్ల పడుతున్న బాధల గురించి వివరించి, "ఈ వంటదయ్యం కొడుకు ఆనందుడనే ఆయన పట్నంలో రెండుచేతులా సంపాయిస్తు న్నాడట. ఈ సంగతి ఆ దయ్యమే చెప్పింది. కొడుకింటికి పోయి, అక్కడ వంటపనుల్లో అతగాడికి సాయపడినా, పీడ విరగడైపోను!" అన్నది కోపంగా.

ఇది విని రాధ ఎక్కడ లేని ఆశ్చర్యంతో, "ఏమిటేమిటీ? ఈ వంటదయ్యం ఆనందుడి మాతృదేవతా? ఆనందుడు మా అన్నయ్యకు మంచి స్నేహితుడు. మా ఇంటికి వచ్చి పోతుంటాడు. వ్యాపారంలో మంచి దక్షత గలవాడు. తల్లికి ఈ ఇంటిమీద మమకారం పోనట్టే, అతడికీ దీనిమీద మమకారం పోలేదు. అప్పట్లో అవసరం కొద్ది పాతికవేలకు అమ్మాననీ, మా తాతాముత్తాతల కాలంనాటి ఇల్లనీ మా అన్నయ్య దగ్గర బాధపడుతుం టాడు," అన్నది.

"పాపం, ఆ మహాగొప్ప వ్యాపారికి, ఇల్లు కొని మేం పడుతున్న బాధలు తెలియవు!" అన్నది సువర్చల ఉక్రోషంగా.

రాధ కొంతసేపు మౌనంగా ఉండి, చప్పున మంచంమీదినుంచి లేచి కూర్చుని, "ఆహా! ఎంత చక్కని ఉపాయం తోచిందే, సువర్చలా! మీ బాధలూ, ఆ ఆనందుడి బాధలూ తీరిపోయే ఉపాయం!" అని, సువర్చలకు చెవిలో రహస్యంగా ఏదో చెప్పి, "నీకు అన్ని విధాలా నచ్చితేనే! నచ్చితే మాత్రం-వంటదయ్యానికి తెలియడం మంచిది కాదు గనక, శుభకార్యం పట్నంలోనే," అన్నది.

సువర్చల సిగ్గుపడిపోతూ, "సరే, నువ్వు చెప్పినట్టే చేద్దాం," అన్నది.

ఆ రోజు తెల్లవారుజామున వంటదయ్యం రాకముందే రాధ, బండిలో పట్నం వెళ్ళి పోయింది. కొద్దిసేపు తర్వాత వచ్చిన వంట దయ్యంతో సువర్చల, "నాకూ, మా నాన్నకూ పట్నంలో అవసరం అయిన పనిబడింది. మధ్యాహ్నం బయలుదేరి వెళుతున్నాం. కనీసం పదిహేనురోజులు అక్కడే ఉండవలసి

వస్తుంది," అన్నది. ఇది విన్న వంటదయ్యం చిరాకుపడి, "ఈపాటి దానికి ఇంత సోదె ఎందుకు? పదిహేను రోజులు సెలవడు గుతున్నావన్న మాట, ఇచ్చాను! సెలవు ముగిసిన మర్నాటి కల్లా తిరిగిరాకపోతే, ఇల్లు పీకి పందిరేయగలను, జాగ్రత్త!" అన్నది.

ఆ మధ్యాహ్నం సువర్చలా, నాగరాజూ బయలుదేరి పట్నం వెళ్ళారు. రాధ, ఆమె అన్నా పూనుకోవడంతో, వారం తిరక్కుండా ఆనందుడితో సువర్చల పెళ్ళి జరిగిపోయింది.

ఆ తర్వాత వారంరోజులు పట్నంలోనే ఉండి సువర్చల, భర్తతో కలిసి తెల్ల వారుజామున ఇంటికి తిరిగివచ్చేసరికి వంటదయ్యం గదిలో కొబ్బరిపచ్చడి నూరుతూ కనిపించింది. సువర్చల దాన్ని సమీపించి, "అయ్యో, అత్తయ్యా! మీ అబ్బాయికి పట్నం వెళ్ళాక ఇప్పుడు పచ్చళ్ళు నచ్చడం లేదు. బెండకాయ తాళింపు చెయ్యి," అన్నది. వంటదయ్యం కళ్ళింతచేసి ఆశ్చర్యపోతూ, "నువ్వు పట్నం వెళ్ళింది, మా అబ్బాయి ఆనందుణ్ణి పెళ్ళాడడానికన్నమాట!" అన్నది.

"అవునత్తయ్యా! మీ అబ్బాయి కొన్నాళ్ళ పాటు, ఈ ఇంట్లోనే వుంటాడు. రోజూరెండు కూరలూ, పప్పుపులుసూ చేయండి. నా కోసం, కందిపొడి, నువ్వులపొడి అప్పుడ ప్పుడు చేయండి. అలసటగా ఉంది, వెళ్ళి పడుకుంటాను," అన్నది సువర్చల ఆవిలిస్తూ.

ఆ వెంటనే వంటదయ్యం కళ్ళెర్రజేసి, "ఆగాగు కోడలుపిల్లా! నీ గడుసుదనం ఇప్ప టికి నాకు తెలిసింది. అత్తగారిచేత పనులు చేయిస్తూ, నువ్వెళ్ళి సుఖంగా నిద్రపోతావా? ఎవరో ఇంకొకరై ఉంటే విడిచిపెట్టే దాన్ని కాదు. సరే, నన్నిలా చూస్తే, నా కొడుకు బాధపడతాడు. నీ వంటగది నీకప్పగిస్తాను. నా కొడుకును జాగ్రత్తగా చూసుకో!" అంటూ మాయమైంది.

అత్తగారిమీది గౌరవం కొద్దీ సువర్చల, వంటదయ్యం గురించి భర్త ఆనందుడికి చెప్పలేదు. అమ్ముకున్న ఇల్లు దక్కినందుకే గాక, సువర్చల వంటి అనుకూలవతి భార్యగా లభించినందుకు ఆనందుడు ఎంతగానో సంతోషించాడు.





# వానరసహాయం

ఒక పట్టణంలో ఒక పేదరాలుండేది. ఆమె భర్త చాలా మంచి పేరు తెచ్చుకున్నాడుగాని దమ్మిడీ కూడా వెనక వెయ్యకుండా, తన భార్యనూ, కుమారుణ్ణీ బీదస్థితిలో ఉంచి చనిపోయాడు. అతని కొడుకు పేరు 'నిద్రమొహం' రంగడు.

తండ్రి పోయేసరికి రంగడికి పదిహేనేళ్ళు. కాని వాడికి కూచున్న చోటినుంచి కదిలే ఓపిక ఉండేది కాదు. వట్టి మన్నుతిన్న పాము. వాడు ఎప్పుడు చూసినా పడుకుని నిద్రపోతూండేవాడు.

"వాణ్ణి దేవుడు అట్లా సృష్టించాడు ఏం చేస్తాం?" అనుకుని రంగడి తల్లి, వాణ్ణి రొష్టు పెట్టకుండా, తానే నాలుగిళ్ళూ తిరిగి, దొరికిన కూలీ చేసుకుని, ఆ డబ్బులతో తన పొట్టా తన కొడుకుపొట్టా నింపుతూండేది. రంగడు తల్లి లేపినప్పుడు లేచి తిన్నంతనే మళ్ళా పడుకుని నిద్రపోయేవాడు.

రంగడి ఇంటిపొరుగునే ఒక వర్తకుడుండేవాడు. ఆయన పేరు వరహాలశెట్టి. ఆయన వర్తకం మీద చీనాకు పోతున్నాడని రంగడి తల్లి విన్నది. అదృష్టవశాత్తూ ఆమెకు అప్పుడే నెలజీతం ముట్టింది. అందులో అయిదు వెండికాసులు తీసి రంగడికిచ్చి ఆవిడ, "నాయనా, వీటిని వరహాలశెట్టికిచ్చి, చీనానుంచి ఇది పెట్టి ఏదన్నా సరుకుతెచ్చి పెట్టమను. దానితో నువ్వు వర్తకం చేసుకుని బతుకుదువుగాని," అన్నది.

తల్లి పోరగా, పోరగా రంగడు ముక్కుతూ, మూలుగుతూ లేచాడు, ఆవలించాడు. తల్లి దగ్గిర అయిదు కాసులూ తీసుకుని, నిద్ర మత్తుగా నడుస్తూ నడుస్తూ వరహాలశెట్టివద్దకు వెళ్ళి, తల్లిచెప్పిన నాలుగు ముక్కలూచెప్పాడు.

రంగణ్ణి చూస్తే వరహాలశెట్టికి జాలి వేసింది. ఆ కొద్ది డబ్బుతో ఈ రంగడు వర్తకం చేసేదేమిటి? బాగుపడేదేమిటి? ఈ

సంగతి తెలిసి కూడా, దయాగుణం గలవాడు కావటం చేత వరహాలశెట్టి, "అలాగేనాయనా!" అంటూ అయిదు వెండికాసులూ తీసుకు న్నాడు. రంగడు మళ్ళీ ఇంటికి తిరిగి పోయి పడుకుని నిద్రపోయాడు.

వరహాలశెట్టి తోటి వర్తకులందరినీ కలుపుకుని, ఓడ మాట్లాడుకుని, మంచి ముహూర్తం నిర్ణయించి లంగరు ఎత్తించాడు. అదృష్టవశాత్తూ దారిపొడుగునా గాలి అను కూలించింది. ఓడ రేవు పట్టినచోటల్లా వర్త కులకు క్రయవిక్రయాలు బాగా సాగాయి.చివ రకు ఓడ చీనాదేశం చేరింది. అక్కడవర్తకు లందరూ తాము తెచ్చిన సరుకులు పూర్తిగా అమ్మేసిమారుబేరానికి చీనాంబరాలూ,దంతపు సామానులూ, రత్నాలూ మొదలైనవి ఎవరి శక్తికొద్దీ వారు కొనుక్కున్నారు. మళ్ళీ ఓడ తిరుగుప్రయాణమయ్యింది.

పదిరోజులు గడిచాక వరహాలశెట్టికి అక స్మాత్తుగా రంగడిచ్చినఅయిదు వెండి కాసుల మాట జ్ఞాపకం వచ్చింది. అది పెట్టి ఏదైనా సరుకుకొనితెచ్చిపెట్టమన్నాడు రంగడు.వర్తకం అడావుడిలో ఆయన ఆ విషయమే మరిచాడు. పోనీ తాను కొన్నవాటిలో ఏదైనా రంగడి కిద్దామా అంటే అంత చవుకైన వస్తువు ఏదీ లేదు.

వరహాలశెట్టి మిగిలిన వర్తకులతో, "ఓడను మళ్ళా చీనాకు తీసుకుపోదాం, ఇలా నావల్ల పొరపాటు జరిగిపోయింది," అన్నాడు.




వారెవ్వరూ అందుకు ఎంతమాత్రం ఒప్పుకో లేదు.

కొన్నాళ్ళు గడిచాక, ఓడ తూర్పుదీవుల్లో ఒక రేవు చేరుకున్నది. ఓడ దగ్గరికి బిచ్చగాళ్ళు చాలామంది వచ్చారు. వారిలో ఒకడి వెంట మూడు కోతులున్నాయి. అందులో రెండు చలాకీ అయినవి. యజమాని ఏ ఆట ఆడ మంటే ఆ ఆట ఆడగలవి. మూడోకోతిముస లిది. దానికి ఒక్క ఆటా వచ్చినట్టు కనబడ లేదు. మిగిలిన రెండూ ఆడుతుంటే అది దిగులు ముఖం పెట్టి సముద్రం మీదికిచూస్తూ కూచుంది.

ఆ కోతులను చూస్తూంటే వరహాలశెట్టికి ఒక ఆలోచన వచ్చింది. రంగడిచ్చిన అయిదు



వెండికాసులతో ఒక కోతిని కొనుక్కుపోయి ఇస్తే తన బాధ్యత తీరిపోతుందనుకున్నాడు శెట్టి.

"అబ్బీ, ఆ కోతుల్లో ఒకటి అమ్ముతావా? అయిదు కాసులిస్తాను!" అన్నాడు శెట్టి కోతులాడించేవాడితో.

"ఈ ముసలి కోతిని తీసుకోండి, బాబూ!" అన్నాడు వాడు.

"పడుచు కోతినివ్వరాదురా?" అన్నాడు శెట్టి.

"వాటిని నూరు కాసులక్కూడా ఇవ్వను, బాబూ. అవే నా బతుకుతెరువు. ఈ ముసలి మొద్దును అయిదుకాసులకు కొన్నాను. తిండి దండగే తప్ప ఒక్క ఆటా రాదు. నేర్పినా నేర్చుకోదు. దాన్ని తీసుకోండి, బాబూ!" అన్నాడు కోతులాడించేవాడు బతిమాలుతూ.

చేసేది లేక వరహాలశెట్టి ముసలికోతిని కొని ఓడ ఎక్కాడు. అది కూడా రంగడిలాటిది గానే కనబడింది. తిండి తినేటప్పుడు తప్ప మిగిలిన అన్నివేళలా కునికిపాట్లు పడుతూ ఉండేది. దాన్ని కట్టివేసే అవసరం కూడా లేకపోయింది.

మరికొంత కాలానికి ఓడ ముత్యాలదీవి చేరింది. ఈ దీవిచుట్టూ సముద్రంలో ముత్యపు చిప్పలు దొరుకుతాయి. ఈ దీవిలో వుండే పల్లెవాళ్ళు వర్తకులు వచ్చినప్పుడు నీటిలో ఈది ముత్యపు చిప్పలు పట్టుకువచ్చి చౌకగా అమ్ముతుంటారు. వర్తకుల అదృష్టాన్ని బట్టి ఒక్కొక్కసారి ఒక్కొక్క వర్తకుడికి ముత్యపు చిప్పల్లో పెద్ద పెద్ద ముత్యాలు దొరుకుతాయి. అదృష్టంలేనివారికి ముత్యపుచిప్పల వెలకూడా గిట్టదు.

ఈ ఓడ ఈ దీవికి వచ్చింది ముత్యపు చిప్పల కోసమే. ఓడ రేవు చేరగానే పల్లె కుర్రవాళ్ళు కేకలు వేసుకుంటూ పరిగెత్తుకుంటూ వచ్చి నీటిలోకి దూకారు. అంతదాకా మన్నుదిన్న పాములాగా కూర్చుని ఉండిన కోతి ఈ కుర్రాళ్ళ కేకలు విని లేచి ఒక్క దూకున ఓడలోంచి సముద్రంలోకి దూకింది.

పాపం, రంగడికి కోతి కూడా దక్కదు కాబోలునని వరహాలశెట్టి భయపడ్డాడు. కాని కొద్దిసేపట్లో ఆ కోతి రెండుచేతులా

ముత్యపు చిప్పలు రొమ్ముకు అదిమిపట్టుకుని ఈదుతూ వచ్చింది. ఓడలోకి ఎక్కి వాటిని ఒకచోట పెట్టి, మళ్ళా సముద్రంలోకి దూకింది. చూస్తూండగానే అది దాదాపు ఒక వంద ముత్యపుచిప్పలు తెచ్చి పోగుపెట్టింది.

మిగిలిన వర్తకులు ఎవరికి తోచినన్ని ముత్యపు చిప్పలు వారు కొనుక్కున్నారు. ఏ ఒకరికీ రెండుమూడు ముత్యాలకు మించి దొరకలేదు. అవయినా చాలా చిన్నవి. కొందరు అదృష్టహీనులకు ఒక్క ముత్యమూ దొరకలేదు. కాని కోతి తెచ్చిన ముత్యపు చిప్పలలో అనేక పెద్ద ముత్యాలూ, చిన్న ముత్యాలూ దొరికాయి.

దీనికి కారణం ఉన్నది. ఈ ముసలి కోతి ఒకప్పుడు ఈ ముత్యాలదీవి మీదనే ఉండేది. దీని యజమాని ఒక పల్లెవాడు. వాడు దీనికి ముత్యపుచిప్పలు పట్టుకురావడం నేర్పాడు. కొంతకాలానికి వాడు చనిపోయాడు. తరవాత దాన్ని ఏ పడవకళాసులో పట్టుకుని కొంతకాలం పెంచారు. అది అస్తమానం నిద్రమత్తుగా ఉండడం చూసి, దాన్ని మరొక దీవిలో కోతులాడించుకునే వాడికి చౌకగా అమ్మారు. అదే ఇప్పుడు రంగడి సొత్తయి, అప్పుడే వాడికొక నిధి పోగుచేసి పెట్టింది. కోతులనాడించేవాడు ఈ కోతిని తనవద్ద అంతకాలం ఉంచుకుని కూడా దాని విలువ తెలుసుకోలేకపోయాడు.

వరహాలశెట్టి రంగడి ముత్యాలన్నీ భద్రంగా దాచి తన పట్టణం చేరగానే వాటిని రంగడికి వప్పజెప్పాడు.

ఆ సొమ్ముతో రంగడు చక్కని మేడ కట్టించుకుని ముత్యాల అమ్మకంతో చాలా ధనవంతుడయ్యాడు. ముత్యాలదీవిచూడగానే కోతికి మత్తు వదిలినట్టే, చేసేటందుకు పనికనబడగానే రంగడి మత్తుకూడా వదిలింది. అతను ఏడాదికొకసారి తన కోతిని తీసుకుని ఓడమీద ముత్యాల దీవికి వెళ్ళేవాడు, ముత్యాలచిప్పలు దొరికినన్ని తీసుకుని తిరగి వచ్చేవాడు. బోలెడన్ని ముత్యాలు దొరికేవి. ఈ విధంగా రంగడు కొద్దికాలంలోనే గొప్ప ధనికుడై, పెళ్ళి చేసుకుని చాలాకాలం సుఖంగా బతికాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 ఆగష్టు నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. SESHAGIRI



S.G. SESHAGIRI

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * **జూన్ నెల 15వ తేదీలోగా** వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **కరిగిన కాలంలో చెదరని శిల్పం!**

రెండవ ఫోటో : **కదలని స్తంభంలో ఆగని కాలం!!**

పంపినవారు : ఎ.వి.ఎస్. ఆచారి, హెచ్. నెం.VI M-237

శైలశ్రీ విహార్, చంద్రశేఖరపూర్

భువనేశ్వర్ - 751016 (ఒరిస్సా).

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Let's make the world a sweeter place to live in.



I'm planting a Tulsi tree. Hope it grows into a B-I-I-G one.



Lovable, blind Chacha Kunwar. He's been my parents' guide. The least I can do is help him cross safely.



Aha! This time Dad's got the flu and Mum's told me to give him a dose of medicine.



Gangu Bai has coolly taken the day off. Leaving Radha Mausi and me in a soapy mess.



Before that rich glutton of a Raju snatches my Kaju Barfi, let me give it to poor Smita.



Naughty Timmy has got himself hurt. Now this lil' Doc will set him right.



I'm helping Uncle Rajeev with the car repairs. Though Mum said "I'll be a spanner in the works".



With Chandra, my maths teacher, numbers are fun. Time I gave her a dozen smiling roses.




**Years and years of sweet success**

